పి. వి. నరసింహారావు,                    హైద్రాబాదు,
ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు.                    1–10–70.

'వరదన్న' రచించిన 'విప్రలబ్ధ' కావ్యం తెలంగాణావారికి చిరపరిచితమైన అనేక దృశ్యాలను జ్ఞప్తికి తెస్తుంది. చక్కని గేయాలతో, హృదయాలను కదలించే ఇతివృత్తంతో, అమృత మొలికించే కమనీయ కవిత్వంతో—సర్వాంగ సుందరంగా రూపొం దిన ఈ కావ్యం వరదన్న ప్రతిభకు తగినట్టిదిగా ఉందనడంలో సందేహంలేదు.

ఇట్టికావ్యాలు మరెన్నో రచించి తెలుగు పాఠకులను రస నిమగ్నులను చేసే సదవకాశం భగవంతుడు వరదన్నకు ప్రసా దించుగాక !

# రసలుబ్ధుల రసాయనం విప్రలబ్ధ

"ఆకాశానికి అంతుంది—కవి
ఆలోచనలకు అంతేది?"—అని

నాలో నేను అనుకున్నాను 'విప్రలబ్ధ' చదివి.

ఇటీవలే (26-3-1970) హైదరాబాదులో నవ్యసాహితీసమితి యాజమాన్యాన జరిగిన ఒక కవిసమ్మేళనంలో శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారు "విప్రలబ్ధ" లోనుంచి ఒక ఘట్టం వినిపించారు:-

"వచ్చెను వచ్చెను వర్షాలు—మా
వసుధారాణికి తలంబ్రాలు"
"కత్తులు కత్తులు కలసినయట్టులు
ఉత్తరదిక్కున ఉరిమింది
కనుపాపల చెక్కని మెరిసింది"

"పాడుకరువులకు బాణాలు—మా
పంటచేలకివి ప్రాణాలు—మా
కాపు కన్నులకు ముత్యాలు—వరి
కట్టల నోళ్ళకు చనుబాలు"

ఈ వర్షాశీర్షికక్రింది ప్రతి పంక్తి యెంతో బాగుంది. అయితే "వరికట్టల నోళ్ళకు చనుబాలు" అన్న పంక్తి మరీమరీ బాగుంది. వరదన్న ఒక్కడే అలా చెప్పగలడా అనిపించింది ఆపంక్తి వినగానే.

"లోకోత్తరాస్సన్తిహి భణితిప్రకారాః"

వరదన్న కవితాభణితి లోకోత్తర మనిపించింది. ఆదేసభలో వారిసోదరులు శ్రీమాన్ వానమామలై జగన్నాథాచార్యులుగారు

తమ "రైతురామాయణము" నుండి కొన్ని మనోహర ఘట్టాలు విని పించారు. అదొక మధురానుభూతి.

ఆ సమ్మేళనంలో "విప్రలబ్ధ" పై మక్కువ కలిగించాడు వర దన్న. ఆపిమ్మట ఆసాంతం చదివి ఆనందించి ఈ నాలుగు మాటలు వ్రాస్తున్నాను.

కావ్యం తిరగేస్తుండగా చంద్రుణ్ణిగురించినపంక్తులు (పేజీ 101) నామనస్సును ఆకట్టుకున్నాయి. గాలీ నీరూ లేని నిర్జీవ చంద్రబింబాన్ని కవులు ఇంకా వదలుకోలేకుండా వున్నారన్నమాట ! అందుకు కారణం ఆ నిర్జీవ శశిబింబం సజీవులైన మానవులపై చల్లనివెన్నెల కురిపించి మురిపించి మైమరపిస్తూ ఉండడమేనేమో ! ఆగుణం చంద్రునిలో ఉన్నంతకాలం కవులకు చందురుడు ఉపాదేయుడే.

"షష్ఠిచంద్రుడు తాను చదల చుక్కలతోడి
తెల్లపిల్లలకోడి తిరిగినట్లుంటాడు"

చంద్రుణ్ణి తెల్లపిల్లలకోడిగా ఊహించడం వరదన్నకే చేతనవు నేమో ! ఇంతకుమించిన మరోపద్యం అదేపుటలో వుంది :—

"ఇనుని తాపమువలన కనుల చీకటిక్రమ్మ
పడియున్న సుకుమార ప్రకృతిసుందరి నోట
గగనమాతయు తనదు ఘన కుచమ్మునుపిండి
పాల్పోయనన శశియు పండువెన్నెల గాయ..."

సూర్యాతపంతో డస్సిన ప్రకృతినోట గగనమాత తనదు ఘన కుచమ్మునుపిండి పాల్పోయుననగా చంద్రుడు పండువెన్నెల కాస్తు న్నాడట ! చాలా గొప్పభావన. గగనమను మాతకు కుచరూపము ధరించి చంద్రుడు ధన్యుడైనాడు !

అనవద్యమైన పద్యరచనా విద్యకు ఆద్యులైనవారితో దీటుగా పోతనచరిత్రము రచించిన అభినవపోతన బిరుదాంచితులైన వరదాచార్యులవారి లేఖిని గేయరచనలోనూ నిండుప్రాయమును అందుకున్నదనటానికి విప్రలబ్ధ గొప్ప తార్కాణము. "పోతనచరిత్ర" రచన ఒక జీవితంపని. అంతటిమహాగ్రంథం రచించిన తరువాత ఇంకా వ్రాసేదేమిటని ఊరుకోలేదు వరదన్న. అయినా ఊరుకోటానికి అతనెవ్వరు? కవి ఇష్టానిష్టాలపై ఆధారపడిలేదు కవితారచన.

"కవి స్వభావానికీ కవి అనుభవానికీ మధ్యగల వైరుధ్యంవలన కవిత పెల్లుబుకుతుంది" అన్నాడు క్రి. కాడ్వెల్. వీటి ఘర్షణకారణంగా కవి ఒక ఊహాజగత్తును కల్పిస్తాడు. అయితే ఆ ఊహాజగత్తు వాస్తవజగత్తుకు దగ్గరగానేవుండి తీరుతుందనికూడా అతనే అభిప్రాయపడ్డాడు.

'విప్రలబ్ధ' రచనకు ఈ సూత్రం చక్కగా వర్తిస్తుంది. కులమతాల సంకుచితత్వాలకు అతీతమైనది కవి హృదయం. వాటికి అతీతంగా ఊహించడం, జీవించడం కవిస్వభావం. లోకంలో అనుభవం వేరుగావుంది కవికి. అతను అడుగడుగునా సంకుచితత్వాన్నీ అసమానత్వాన్నీ చూస్తున్నాడు. వీటి ఘర్షణ "విప్రలబ్ధ".

"నీవెవడవు ? నీవెవడవు ? నిజంచెప్పు మానవుడా !"
అని అడుగుతున్నాడు కవి. తనే జవాబు చెబుతున్నాడు
"నిజముగ మానవుడవీవు, నీజాతియె మానవత"
"ఆల రంగదేదియైన పాలరంగ దొక్కటియే"

ఆవుల రంగునుబట్టి పాలరంగు మారదనీ, కులమతాల వైవిధ్యంవల్ల మానవత్వం చెడరాదని కవి అభిప్రాయం.

కావ్యనాయిక లక్ష్మి జన్మతః మహమ్మదీయబాలిక. ఆమెను పెంచినవారు హిందువులు. ఆమెను ప్రేమించి పెండ్లిచేసుకొన్నవాడు రాముడు—మహమ్మదీయుడు కాడు. ఏటిలో కొట్టుకొనిపోతున్న లక్ష్మిని కాపాడినవాడు విప్రుడు. కులాలకు మతాలకు అతీతమైన మానవతాప్రబోధమే ఈ కావ్య ధ్యేయం. 1970 లోకూడా ఇట్టి ప్రబోధం అవసరంకావడం మనదేశపరిస్థితిని చెప్పక చెబుతున్నది. ఈ ప్రబోధం చాలామంది చేస్తున్నారు. కాని దీనికి కావ్యత్వం కల్పించాడు వరదన్న.

"ఉక్తి విశేషః కావ్యం"

చెప్పడంలో చెప్పడంలో తేడావుంది. వరదన్నచెప్పే తీరువేరు. మనను గ్రామీణ వాతావరణంలోకి పూర్తిగా లాగుకొనిపోయేలా ప్రతికల్పన అందుకు అనుగుణంగా చేశాడు. ఉదయాన్నిగురించి చెప్పినప్పుడు "పూర్వదిశ నరుణిమలు పుంజురాయళ్ళగుచు, గళమెత్తి కొమ్మ్మాది జయగానములబాడు" అంటాడు. చందమామను వర్ణించినప్పుడు "తెల్లపిల్లలకోడి" అంటాడు. కాబోయే రైతురాణిని ఆహ్వానిస్తూ—"బంతిపూల కొప్పులతో, పచ్చబొట్ల యొప్పులతో రావే దొరసానీ ! రావే దయబూని" అంటాడు.

వరదన్న రైతుపక్షపాతి. రైతులేనిది భారతిజాతి లేదు. ఈ మాటను యెంతో బలంగా గుండెలకు హత్తుకునేలా చెబుతాడు కవి "విప్రలబ్ధ" లో :—

"రైతన్నలేనిరోజు, మనజీవితాలు క్లోజు
పోతన్నరైతురాజు, వారంటె ప్రజకుమోజు"

(పేజీ 78)

కావ్యపాకం తెలిసినవాడు వరదన్న. కనుక ఎక్కడా ఒక్క అక్షరం మార్చడానికి వీల్లేనంత పకడ్బందీగా గేయం అల్లుతాడు. పైన నేను ఉదహరించిన గేయం ఇందుకు ఉదాహరణ. దీన్నే ప్రాచీనులు

"పదానాం పరివృత్తి వైముఖ్యం పాకః" అన్నారు.

ఈ క్రిందిపంక్తులనుకూడా ఈ పరివృత్తి వైముఖ్యానికి ఉదాహరణగా చూపవచ్చు.

"ఇంటిలోగింజల్లు మంటిలోబోశాము
మింటికేయీాజూచి కంటనీరెట్టాము"

వాగర్థాల సుభ్రాత్రంకూడా వరదన్నలో నిండుగా కనిపిస్తుంది.

ఈ కవి రమణీయమైన భావనలకు ఎన్నైనా ఉదాహరణలు చూపవచ్చు.

వానమబ్బులను పచ్చికడవలతోను, పిడుగులను రాళ్ళతోనూ పోల్చి, ఆ రాళ్ళతాకిడికి ఈ పచ్చికడవలు విచ్చిపోవడంవంటి భావన కడు రమణీయమైనది.

"బండమీద వరదపాశం పోయడం" వగైరా వివరాలను గ్రామ జీవితం, ముఖ్యంగా వ్యవసాయం బాగా యెరిగిన వరదన్నవంటివారే కావ్యాల్లోకి చేర్చగలరు.

ప్రతి సహృదయుణ్ణీ ముగ్ధుణ్ణి చేసివేసే పంక్తులు కోకొల్లలుగా విప్రలబ్ధలో కనిపిస్తాయి. ఉదహరించలేకుండా ఉండలేని కొన్నిపాదాలు ఇక్కడ ఇస్తున్నాను.

"ఆరవేసిన చీరల వోలె
తూరపుగట్లం దావులు మేసె,
నడిచే నల్లని గండశిలలవలె
పడమటిగట్లను గేదెలు మేసె"

మహాకవి భావన ఇది.

వంగి వరికోస్తున్న పడుచులు "పంటలక్ష్మిని కొనివచ్చే పల్లకీ"ల వలె ఉన్నారనడం ఎంతో బాగుంది.

చందుర్ణ్ణి ముద్దుగా చందప్ప అనడం వరదన్న ప్రత్యేకతగా కనిపిస్తుంది.

తెలంగాణా మాండలికాలను ఎంతో ముచ్చటగా వాడుతారు ఈ కవి!

భూదేవి సాక్షిగా గోదల్లు సాక్షిగా

"గొడ్డూగోదా" అనేమాట అంతటా వాడతారుగాని 'గోదల్లు' అని విడిగా వాడ్డం తెలంగాణాలోనే వుందేమో అనుకుంటాను.

"అటిటు చూడకెలక్ష్మి ! అగమైపోతావు"

"తప్పిపోతావు" అనే అర్థంలో ఈమాట ఎంతో ముచ్చటగా వుంది.

"వింటులేవా", "అగపడుతులేవా ?" "కూలిపడినవ్వులు" "కబురుచేసేదుంటె" వంటి ప్రయోగాలు తెలంగాణా ప్రాంతీయములు.

సలక్షణమైన పద్యరచనచేసే వరదన్న ఈ గేయకావ్యంలో కొన్నికొన్నిచోట్ల యతిభంగాన్ని లక్ష్యపెట్టకుండా సాగారు,

బండ్లనుండీ వడ్లు తోడిపోయండి
కరువు కన్నులలోన దుమ్ముకొట్టండి
చింతల్లు చీకట్లు తీసివేయండి.

మహోద్రేకంలో పాడుతూపోతున్నాడు కవి. వెనుతిరిగి చూడడానికి విరామంలేదు. యతికోసం దిద్దితే మతిపోతుంది. మరీ పల్లెపాట ఫక్కీలో వెళ్ళినచోట 'లో'. 'తో' హ్రిస్వాలుగా వాడబడినవి. "పిల్వకుండనె యెదలో పీటేసి కూర్చుండి"—(పేజీ 20)

యేంకిపాటలను తలపించేపంక్తులు అక్కడక్కడా తగులుతాయి ఈ కావ్యంలో.

ఉదా॥ "ఎటుమరచి యుండగలను ?
నాసామి నెటువిడిచి యుండగలను ?"

"ఎన్నెట్లో సెలయేరు
యెన్నలా కరిగింది"
"కనపడితె నేచాలు కడుపునిండన్నాలు"

శ్రీనాథుడు పెద్దనలో అక్కడక్కడా కనిపించినా పెద్దన వ్యక్తిత్వం చెడనట్లు నండూరివారి ఛాయలు అక్కడక్కడా తోచినా వరదన్న తనముద్రను వదలుకోలేదు.

నా హృదయానికి హత్తుకున్న మరికొన్ని పంక్తులు ఇక్కడ ఉదహరించకుండా ఉండలేను.

నానీడగా నాకంటిపాపగా ఉండమని రాముడంటే లక్ష్మి గడుసుగా జవాబిస్తుంది :—

"నీడనై రాత్రినిను వీడియుండెట్లాగు
నీకంటి పాపనై నినుగాంచుటెట్లాగు"

"మిట్టపల్లాల యిక్కట్టులెన్నుంచేమి
గంగ రత్నాకరుని కలియకుంటాదె ?"
"బతుకు సంసారంపు బండి బరువెంతైన
ఏకమై నాగేటి యెడ్లోలె మోస్తమని"

గ్రామంలో విద్యుద్దీపాలు వెలగడాన్ని కవి అద్భుతంగా చెప్పాడు :—

"ఆకాశంబున తారక లవకతవక నున్నావని
విద్యుద్దీపముల వరుస వెక్కిరించుచుండె దివిని"
"అగ్నివాయువరుణులెంత యరచిన వినలేదు మొరలు
ఇరువదినాలుగుగంటలు ఇకమన సేవకులు సురలు"

లక్ష్మి పసిపాపను ఉద్దేశించి అన్నమాటలు అత్యంత భావ బంధురములు.

"అతిరహస్య దేశంలో.........
..........................
మామలిన ప్రేమరసం మంచిజేసి వడబోసి
నీమోహన రూపంలో నిఖిలజగతి కందజేత"
"మారీచుని మాయలేడి మతిదోచని రాముడవో
ఆదిశేష సర్పముతో ఆటలాడు దేవుడవో" (పేజీ 85)

పాలనూ నీళ్ళనూ వేరుచేసే హంసవలె తాలునూ మేలు ధాన్యాన్ని వేరుచేయాలంటాడు రాముడు లక్ష్మితో—

"తాలుధూళిని మేలు ధాన్యంపురాసుల్లొ
పాలు నీరూ వేరుపరచేటి హంసల్లె..." (పేజీ 76)

బండొచ్చె బండివచ్చె రెండెడ్ల చక్కనిబండి
నిండు గర్భవతివోలె బండి వచ్చెనండి (పేజీ 77)

ఇలా చెబుతూపోతే మరోపుస్తకమవుతుంది.

తిరుపతి కొండెక్కుతూ రాముడు లక్ష్మితో :—

"అవిటోళ్ళు చెవిటోళ్లు అంధుల్లు, కుంటోళ్ళు
చేసికోవేలక్ష్మి తోచిన ధర్మాలు
మనసుబట్టగలేక పాపాలు చేస్తారు
ఎన్నంటి కుడుపవే ఎవరోరికర్మాలు"

అంటాడు. వికలాంగులంతా పాపులనే సిద్ధాంతం భయంకర మైనది. ఈ నమ్మకం రైతు రాముడికేగాని కవిగారికి లేకపోవుగాక.

నా హృదయాన్ని యెంతగానో కదలించిన ఈ రమణీయ కావ్యాన్ని చదివి అత్యంత ముగ్ధుడనై వరదన్న కవితాహృదయానికి జోహారు అర్పిస్తున్నాను. ఈ రమణీయ కావ్యరత్నానికి వరదన్న తలచినట్లయితే మరింత మెరుగులు దిద్దగలడనడంలో సందేహము లేదు. ఆ ప్రసాధనాన్ని వరదన్న ద్వితీయముద్రణలో చేయవచ్చు. ప్రసాధనం అంటే పూర్వుల అభిప్రాయం.

వృత్త్యాదీనాం సమష్టిస్స్యాత్
సాహిత్యం సత్పరిష్కృతః
శబ్దార్థయోః సంస్కారః
కవిస్తస్య ప్రసాధనం॥

మద్రాసు. }
1—5—1970. }

దాశరథి.

# పాటల పేటిక

పోతన్న చరితరాసిన వరదన్న ఈసారి రైతన్న కతరాసి పోసినాడు. ఆ పోతన్న ఒక రైతన్నే. మరి ఈ రైతన్నకూడా ఒక పోతన్నే.

"కోతలపాటలవాణి కొడవలిగొను శర్వాణి
పాడిపంటలను భువికై ప్రసాదించు శ్రీపాణి"

ఈ పంక్తుల్లోని అంత్యప్రాసనియమం పోతన్న పుక్కిటబట్టిందే.

'మీలో పద్మదళాలో' అన్నప్పుడు, 'పికమై మధుమత్త శిలీముఖమై—శుకమై' అన్నప్పుడు గుప్పున వాసించే అనుప్రాసగంధం పోతన్న పదరచనారీతికి సరికొత్త అనుబంధం.

వానమామలై వరదాచార్యులుగారు సమస్తాంధ్ర మహాకవుల ప్రతిభావ్యుత్పత్తుల వడపోతగా పోతన్నచరితం ప్రబంధంగా రచించిన పూతచరితులు. సుధాతరంగితములైన సుసంస్కృత పదనిర్ఝరులనూ, కపురపు పలుకులవంటి కలకండ చిలుకలవంటి జానుతెనుగు నుడులనూ, చిత్తదీపకములైన చిత్రచిత్ర శబ్దార్థాలంకారాలనూ గుత్తకుగొన్న ప్రౌఢకవీంద్రులు. ఆయన నిరంతర కవితాతపస్సుకు అక్షరఫలితంగా వెలువడిన అమృతపాత్ర పోతనచరిత్ర. పోతన చరిత్రద్వారా అమృతపువిందులు చేయించిన వరదన్న ఈ గీతికా పాత్రికద్వారా పన్నీటి చిందులు చూపిస్తున్నారు. పోతన చరిత్రము సమతలంలో మంద్ర గంభీరంగా నడిచిన మందాకిని. ఈ సంపుటి కొండకోనలనుండి దూకి పలువైపుల పాయలుగా సాగి గలగల పారే సెలయేటి బోటి. దేనికదే మరి.

అక్షర రమ్యత, అనుప్రాసగమ్యత, అర్ధభావుకత, అలంకార బంధురత వరదాచార్యుల కవిత్వంలో వరిష్ఠంగా కనిపించే గుణాలు. పద్యం పలికినా పాట చిలికినా, ప్రబంధం నిబంధించినా పంచరత్నాలు ప్రవచించినా ఈ గుణాలను చతురంగా చతుర్ముఖంగా భాసింపజేసే వాణీరమ్యులు వరదులు.

'తమ్ములును సుప్తనేత్రమ్ములోక రవ విప్ప,
కొమ్మలు పికమ్ముల గళమ్ములను సవరించి'

అన్నప్పుడు అక్షర రమ్యత అనుప్రాసగమ్యత ఆలింగనం చేసుకున్నవి. వర్షాలు

"కాపు కన్నులకు ముత్యాలు వరి
కర్రలనోళ్ళకు చనుబాలు"

అన్నప్పుడు ఆత్మీయంగాతోచే అర్ధభావుకతకు అంచనా కట్టగలమా? సెలయేరు 'మహీవక్షోజములజారు మేల్ముత్తెములపేరు' అని ఉత్తాలంగా ఉత్ప్రేక్షించినప్పుడు, 'ఎన్నెట్లో సెలయేరు ఎన్నలా కరిగింది' అని మెత్తగా ఉపమించినప్పుడు పరుచుకున్న అలంకారబంధురత ప్రశంసాపాత్రంకాదా!

రైతురాముని ప్రియురాలు—తర్వాతి ఇల్లాలు లక్ష్మి. ఆమె తనువు సింగారమట. గుణము బంగారమట. అంతేనా! ఇంకాఉంది. 'అన్యులంటగరాని అగ్గి ఆ శీలమ్ము'. సీతకు సహజాతమైన శీలం ఎంతో ధ్వనిప్రాయంగా చెప్పబడింది. తనపత్ని అంతర్వాత్ని అని తెలియని రాముడు అర్ధాంగి ఎడాటాన్నిచూసి 'పరవానిగా నన్ను పరికింతువేల' అంటాడు. అప్పుడు లక్ష్మి 'వరిపొట్టకొచ్చెనని చిరునవ్వు' నవ్వుతుంది. అల్పాక్షరాల్లో అనల్పార్థరచనకు ఇంతకుమించిన ఉదాహరణ మేముంటుంది.

ఈ కృతి పేరు విప్రలబ్ధ. పేరులోని శ్లేషక్రీడ సహృదయవేద్యం. రచనలో పాటలముత్యాలకు ఏకసూత్రత ఘటించడానికి కొంత ప్రయత్నం జరిగింది. అయితే ఈసంపుటిని కథాసమన్వయ దృష్టితో కాకుండా కవితాస్వాదన దృష్టితో చూడగలిగితే రసానందసింధువులను పుడిసిలించుకోవచ్చు.

"రామ చక్కనిగుణం", "అగమైపోతావు", వంటి అచ్చ తెలంగాణా పలుకుబళ్ళను పొదుగుకున్న ఈకృతి నిదురోము, మూగారు, నవ్వుల్లు, పువ్వుల్లు వంటి సమస్తాంధ్ర ప్రాంతాల యాసనుడులను కూడా తనలో కలుపుకోవడం గమనింపదగిన అంశం.

వరదాచార్యుల వృత్తరచనా కౌశలానికి పోతన చరిత్రము దీపస్తంభంగా నిలిస్తే, మాత్రాచ్ఛందో ఘటనాపటిమకు ఈ పాటల పేటిక మచ్చుతునకగా నిలుస్తుంది.

ఈ గేయమంజరి నా బాల్యమిత్రుడూ నిత్యమైత్రీసూత్రుడూ ఐన (శ్రీ) ఎన్. వి. రాజిరెడ్డి పేర పరిమళించడం నా ఆనందానికి మారాకు తొడిగినట్టయింది. అభినవపోతన్నకూ, మిత్రుడు ఎన్. వి. రాజన్నకూ ఉన్న అలఘుస్నేహానికీ, అనురానుబంధానికీ ఈకృతి శాశ్వతాకృతిగా నిలిచిపోతుందని విశ్వసిస్తున్నాను.

'త్రివేణి'
హైద్రాబాదు—20
10—4—70.

సి. నారాయణరెడ్డి.

డా. దివాకర్ల వేంకటావధాని, ఏం. ఏ. (ఆనర్సు) పి. హెచ్. డి.

ఆంధ్రశాఖాధ్యక్షుఁడు—ఉస్మానియా విశ్వవిద్యాలయము.

కవిపుంగవులు శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారు రచించిన 'విప్రలబ్ధ' యను గీతకావ్యమును పఠించి యానందించితిని. లక్ష్మీ రాములను దైతుదంపతుల అయోగ వియోగ శృంగారములను, పునస్సమాగమమును వర్ణించుచు శ్రీమదాచార్యులవారిందు జానపద జీవిత సౌందర్యమును గుమ్మరించినారు. విప్రలబ్ధ పదమునకు వారొసంగిన యర్థద్వయము చమత్కారవంతమై యింపునింపుచున్నది. ప్రసక్తానుప్రసక్తముగా వారిందు చొప్పించిన కాక శుక సందేశములు హృద్యములుగా నున్నవి. వారి రచన జానపద నాయికానాయకుల కుచితమైన భాషతోడను, అకృత్రిమములైన భావములతోడను, నిసర్గ సుందరములైన యలంకారములతోడను గూడి చదివినకొలంది చదువ వలెనని చవులూరించు చున్నది. అక్షరగణబద్ధములైన వృత్తాదులను వలెనే మాత్రాగణబద్ధములైన వివిధపరిమాణములుగల గేయములను కూడ రచించుటలో శ్రీమదాచార్యులవారు చూపిన నేర్పు వారి సవ్యసాచిత్వమును చెప్పక చెప్పుచున్నది. వారు వాడిన పదములును పదబంధములును తెలుఁగు పలుకుబడియందలి పొలుపు నొలుకఁబోయు చున్నవి. ఛందోవస్తువు లెట్టివైనను ప్రతిభావంతుఁడైన కవి చేపట్టి నప్పుడు కావ్య మపూర్వ సౌరభముల గుబాళింపఁజేయుననుట కిది మేటి తారకాణ.

దివాకర్ల వేంకటావధాని,

29-3-1970

# విజ్ఞప్తి

ఈ కావ్య నిర్మాణమునకు ప్రస్తుతం దేశంలో అచ్చటచ్చట జరుగుతూఉన్న మతకల్లోలాదికములే కారణాలు. అవి నా హృదయాన్ని కలతపెట్టినవి. నాలోనున్న అంతర్వాణి ప్రేరేపించినదీకావ్య నిర్మాణమునకు.

వాస్తవంగా ఇదొక కల్పితగాథకాదు. పోలీసుచర్య నైజాంలో జరిగినప్పటి ఒక సంఘటన. ఈ గాథలో ఉచితగతి నావల్ల కొన్ని మార్పులు జరిగినాయి. వానిని సహృదయులు ఆమోదిస్తారని నాకు విశ్వాసమున్నది. ఎన్నిపనులున్నను వీలు గలుగజేసికొని నాపైగల ప్రేమాభిమానములతో దీనిని సర్వాంగ సుందరముగా ముద్రించి యిచ్చిన శ్రీ పబ్బా శంకరయ్యగారికి నా అనంత మంగళాశాసనములు.

దీనిపై అనేక కార్యాంతర్మగ్నులై యుండియు నే నడిగినంత మాత్రమున పీఠిక వ్రాసియిచ్చిన శ్రీ గౌ. విద్యాశాఖామాత్యులు పి. వి. నరసింహారావుగారికి కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

మరియు పూజ్యులు శ్రీ దివాకర్ల వేంకటావధానిగారికి, ఆప్త మిత్రులు శ్రీ దాశరథి, శ్రీ నారాయణరెడ్డి గార్లకు ముఖపత్రాన్ని అలంకరించిన మిత్రులు మడిపడగ బలరామాచార్యగారికి నేను సర్వదా కృతజ్ఞుడను.

ఇట్లు,

రచయిత.

# కృతిభర్త పరిచయము.

ఆదిలాబాదు జిల్లాలోని చెన్నూరు తాలూకాకుజెందిన భీమవరమను గ్రామములో సుప్రసిద్ధ జమీందారులు, సౌజన్యనిధులు అత్యుదారులని ఖ్యాతివహించినవారు శ్రీ నరహరివంశ వారాసిచంద్రులు శ్రీనరసింహారెడ్డిగారు. వీరిభార్య ఉత్తమసాధ్వి మాణిక్యాంబ. ఈ పుణ్యదంపతులకు ముగ్గురు కూతుండ్రు, ఇద్దరు పుత్రులు. పెద్దవారు విద్యానిధులు, శాంతస్వరూపులు, సచ్చరిత్రులు, శ్రీ రాజిరెడ్డిగారు వీరిభార్య శ్రీ జయాంబ. రాజిరెడ్డిగారి తమ్ములు భాస్కరరెడ్డిగారు వీరిభార్య శ్రీ హేమలతాదేవి.

ప్రస్తుత కృతిభర్తయైన శ్రీ రాజిరెడ్డిగారి తండ్రిగారి సమయమునుండి మా తండ్రిగారు శ్రీమాన్ బక్కయ్యశాస్త్రిగారు ఆస్థాన విద్వాంసులుగానుండి పోషింపబడినారు.

ఇట్లు,

రచయిత.

# అంకితము

నరహరి ప్రఖ్యాతవంశా నర్ఘ రత్నాకరము పొంగగ
సత్కళానిధి రాజు పూర్ణశశాంకుడై ప్రభవమ్మునొందెను
బాల్యకాలము నుండి సర్వజ్ఞాలితల ధరియించుజ్యోతి
శాంతవర్తను డిద్ధతేజుడు సతతవిద్వత్పక్షపాతి.

భాస్కరుండును, రాజచంద్రుడు పవలు రేలును వెల్గులీనుచు
నారసింహుని రెండుకన్ను లనంగదనరి యశంబుగాంచిరి
రాజచంద్రుడు శ్రీజయాప్తిని రాజిలెను భక్తప్రసన్నత
భాస్కరుండిల హేమకాంతుల భాసిలెన్ హైరణ్యజేతగ.

ప్రోల్లసన్మాణిక్యగర్భా పూర్వశోభా విమలసీమల
రామలక్ష్మణులట్లు మణులటు రాజిలిరి సోదరులు ప్రేమల
సరసహృదయు లుదారచిత్తులు సద్గుణాన్విత సత్యకీర్తులు
సాధువర్తను లాప్త విద్యాచతురమతులును దయామూర్తులు.

శ్రీమహితహిత గేయకావ్య శ్రీలదేలెడి విప్రలబ్ధను
ప్రేమసూత్రమునందు సుమనస్తోమమున జతగూర్చి శ్రద్ధగ
చంద్రునకు నొకనూలుపోగను చందమున యానందసంగతి
రాజరెడ్డి మనస్థితాత్మా రామునకు కైసేతునీకృతి.

సరసవాక్య సువర్ణమృదుపద చతురవృత్త ప్రసన్నచిత్తయు
వరదరాజు సుకావ్యకన్యక వరునిగాగొనె రైతురాజును
ఆయురారోగ్యాభివృద్ధియు నపరిమిత సద్భాగ్యసిద్ధియు
చేకురన్గృతి కన్యకామణి స్వీకరింపవె రైతురాజా.

---

# ముందుమాట.

రజాకార్ల దుస్సహ దౌర్జన్యాలతో, దోపిడులతో, స్త్రీల మాన భంగాలతో నలిగిపోతున్న తెలంగాణముపై పోలీసుచర్య జరుపుచున్న రోజులవి. అరాజకంగానున్న దేశంలో స్వార్థపరులైన కొందఱి దుండగులముఠాలు బయలుదేరి మతకల్లోలాలను రేకెత్తింపజేస్తూ పల్లెలలో నున్న ముస్లిం కుటుంబాలపైబడి నానాహింసలబెట్టు కిరాతకృత్యాలతో, పశుచర్యలతో వీరవిహారం చేస్తూఉంటారు.

రామవరమను ఒక పల్లెలో ఒక ముస్లింకుటుంబముపై దాడి జరపడానికి వారి యింటిముంగిట్లో ప్రవేశిస్తారు. ఇది వారికి తెలుస్తుంది. తక్షణం దిడ్డిదారిగుండా పలాయితులై ప్రాణాలను రక్షించుకొంటారు. దుండగులు ఇంటిలో ప్రవేశిస్తారు. వారికన్నులకు పదినెలల పసికందువొకటి ప్రత్యక్షమౌతుంది, వారా అమ్మాయిని చంపడానికి బూనుకొంటారు. ప్రక్కనున్న కాపుకుటుంబం ఆపిల్ల తమపిల్లే అని ఆ ముస్లిందంపతులకు సంతానము లేకుండుటచే వారిశిశువును తీసికొనివచ్చి ముద్దాడుతూ ఉంటారని అలాకాకున్న కన్నకడుపును విడిచి ఇలావెళ్ళడం సంభవిస్తుందా ! యని నచ్చజెప్పి తప్పించి ఆ శిశువును కాపాడుతారు.

ఆపిల్లను సంతానములేని కాపుదంపతులు గారాబంగా పెంచుతూ ఉంటారు. అమ్మాయి మూడేండ్లదౌతుంది. సమాజం వారిని వెలివేస్తుంది. సమాజపు ఒత్తిడికి తాళలేక, పెంచినబిడ్డపై పెల్లుబికే మమతలు వీడలేక, వారు చాలాదూరములోనున్న ఆంధ్రప్రాంతంలో గోదావరి ఒడ్డుననున్న చిన్న పల్లెలో బసజేసి ఆ బిడ్డను తమ కన్నబిడ్డనుగానే చెప్పుకుంటూ నిశ్చింతగా కాలక్షేపం చేస్తూఉంటారు.

ఆపిల్ల పెరిగి పదహారేళ్ళ ప్రాయంగలదై యుంటుంది. చుట్టు పట్లనున్న పల్లెల్లో సంపన్న కాపుకుటుంబాలవారి చేలల్లో పొలాల్లో కూలీనాలీచేస్తూ తలిదండ్రులకు చేదోడుగా ఉంటుంది. తలిదండ్రుల సాహచర్యంలో తెలంగాణపు బాసను మధ్యమధ్య ఆంధ్రప్రాంతపు యాసను జతపరచి కలగాపులగంగా మాటాడుతూ ఉంటుంది. రాముడు నూనూగు మీసాల నూత్నయౌవనంలో నున్నవాడు. ఒక సంపన్న కర్షక కుటుంబానికి చెందియుంటాడు. చూడసొగసైన రూపంతో ముచ్చటగొల్పుతాడు. పొలంలో నాట్లకు, కల్పులకుగా నరుగుదెంచిన అపురూపసుందరియైన ఆ తరుణిని ప్రేమించి తలిదండ్రుల యిష్టానికి వ్యతిరేకంగా పెండ్లాడుతాడు. అంతస్తుకుదగ్గ సంస్కారవతిగా జేయ డానికి చదువూ సంధ్యా నేర్పిస్తాడు. ఆమె వాగ్వ్యవహారంలో గ్రామీణభాష మరియు సంస్కృతసూక్తి కలసి మెలసి కదంతొక్కుతూ ఉంటాయి.

మధ్యన ఒక మిత్రునివలన లక్ష్మి ముస్లింకుటుంబానికి జెందిన దని తెలిసికొని, అది తన తలిదండ్రులకు తెలిస్తే ఇంటినుండి గెంటివేస్తా రని పూర్ణ గర్భవతిగానున్న తనభార్యకు నానాటికి పెరుగుతున్న తన వివాహ విషయంలోని పితరుల వైముఖ్యాన్ని తెలియపరుస్తాడు. మనకు వేరే వసతికల్పించి కాపుర మేర్పాటు చేసేవరకు ఎట్లాగో సహించుకొని పుట్టింటిలోనే యుండవలసినదిగా నచ్చజెప్పి ప్రసూతికనీ పంపిస్తాడు. బిడ్డవిషయం దుఃఖితులగు అత్తమామలకు లక్ష్మికై వేరే యిల్లు నిర్మాణం చేసేవరకు మొహం చూపించనని వాగ్దానంచేస్తాడు. ఆమె చాలనాళ్ళు తల్లిగారింటిలోనే యుండుటచూచి ఏదో చేయరాని పని ఇది చేయడంమూలంగా దీనిమగడు విడిచిపెట్టి ఉంటాడని లోకులు కాకులు చాటుకూనేటుకు ఆడిపోసుకుంటారు.ఇదిలక్ష్మిచెవికివినవస్తుంది. లక్ష్మి తనమగనికి ఉత్తరంవ్రాస్తూ నీవికవచ్చి నన్ను తీసికొనిపోకుంటే

నేను ఆత్మహత్య జేసుకోవడం తథ్యమని తెలియపరుస్తుంది. లక్ష్మివిష యంలో తలిదండ్రులతో పడిరాని కారణంగా వేరేయిల్లు నిర్మించిగాని లక్ష్మిని తీసికొనిరారాదని గట్టిపట్టుబట్టి యింటినిర్మాణంలో రేయిం బవళ్ళు మగ్నుడై యున్న రాముడు "నేను గోదావరి ఈవలి తీరానికి వస్తున్నాను. నీవువచ్చి నన్ను కలియవలసినది. నీతో కొన్నివిషయాలు మాటాడాల్సి యున్న" దని భార్యకు తెలియజేస్తాడు.

అదేరోజు లక్ష్మి యీవలితీరంలో వేచి చూస్తూఉంటుంది. రాముడు ఈవలితీరం జేరవస్తాడు. అది వర్షకాలం గోదావరిపొంగి తీరాలనొరుస్తు ప్రవహిస్తూఉంటుంది. గాలి జోరుగా వీస్తుంటుంది. జెస్తవాడు నదిలో పడవ విడవడానికి నిరాకరించి భోజనానికని ఇంటికి పోతాడు. అదివరలో అత్తగారి యూరుప్రక్కనున్న సెలయేరులో నిరాఘాటంగా దంపతుల విహారంలో పడవ నడపనేర్చిన లక్ష్మి నావికుడు పోజూచి తానే ఓడనుతీసికొని నదిలో జారుతుంది. గాలివాన తీవ్రమై నిలువెత్తు అలలతో నది యల్లకల్లోలంగా ఉంటుంది. రాముడు పడవతెచ్చేది లక్ష్మియని గుర్తించి, రావద్దని మరలిపొమ్మని అరచి చెపుతాడు. లక్ష్మి ఎంతవారించినను వినదు. నిన్నువిడిచి కన్నీటిలో కాలుతూ బ్రతుకుటకంటె నిన్నుజూస్తూ చన్నీటిలోచచ్చుటే హాయిగానున్నదంటుంది. అలలు పడవను తలక్రిందులు చేస్తాయి. తుదకు పడవ ఒక సుడిలోజిక్కి మునిగిపోను సిద్ధమౌతుంది. రాముడు నీటిలో దూకుతాడు. లక్ష్మి నేను పోతున్నాను. మనపాపను కంటిపాపగా సాదుటకు నీవైనా ఉండవా ? నా తుదికోర్కె మన్నించవా ? అని అరుస్తుంది. పడవ మునుగుతుంది. రాముడు మునుగుతాడు కాని పడవ చేయిదాటిపోతుంది. రాముడు లక్ష్మి తుదికోర్కె తీర్చుటకు తీరానికి విధిలేక జేరుకుంటాడు. పతివంచితయై విప్రలబ్ధయైనట్లే విప్రునిచే నదిలో రక్షింపబడి విప్రలబ్ధగా రామునికి దక్కుతుంది లక్ష్మి.

**వానమామలై వరదాచార్యులు.**

శ్రీ వాగీశ్వర్యై నమః

# విప్రలబ్ధ

*రైతురాజును నిదురలేపుటకు కవి సుప్రభాతము పాడతాడు.*

నిద్రలేవోయి ఓ రైతురాజా
లేగ-టావుల్లు పాల్చేపి యంభారవళిబిల్చు

ప్రాకృతియు నొక్కవంక పైడి పళ్ళెర మూని
తారకామణి దీప నీరాజనాలిచ్చు
అడుగులకు మడుగులే యర్పించు పచ్చికలు
పరచు హిమబిందువుల పాద్యక్రియలొసంగు.

పూర్వదిశ నరుణిమలు పుంజురాయళ్ళగుచు
గళమెత్తి కొమ్మాది జయగానముల బాడు
చూచుచుండగ వేగు చుక్క తొలిదెసపొడిచి
కటిక చీకటి గుండె గాయపరచెను స్వామి.

చీకటులు గబ్బిలపు మూకలై తలవంచె
చీకు కన్గవ సంధలోకాల నివసించె
చుక్కలన్నియును మంచు చుక్కలై పచ్చికల
పై వ్రాలె ముత్యాల పారజల్లిన లీల.

తమ్ములును సుప్తనేత్రమ్ము లాకరవ విప్ప
కొమ్మలు పికమ్ముల గళమ్ములను సవరించి
ఝుమ్మను రవమ్ముల గళమ్ములను సవరించి
కమ్మనగు సుప్రభాతమ్ము బాడు విపంచి.

రైతురాజును కవి సాదరంగా ఆహ్వానిస్తాడు.

నీవు రావోయి ఓ రైతురాజా !
మాకు పాడి పంటలొసంగి భారతావని నేల.

రవి శశియు నిత్య నీరాజనములీయగా
పవనుండు తరులతా చామరము వేయగా
నవమోహనమ్ములౌ నాగేటి వృషభముల్
నందీశ్వరులుగాగ నటరాజ మూర్తివై.

విప్రలబ్ధ విప్రలబ్ధ

హలము దాల్చిన నాటి బలరాముడోయనగ
వరకుఠారముబూను పరశురాముడౌ యనగ
సీతతోగూడుకొను శ్రీరాముడో యనగ
ప్రగ్గాల మునుకోల పార్థ సారథివనగ.

భూదేవి నినుదాక మైపులకలేపార
గోమాత నీవంట పాలచేపులు మీర
ఆకాశగంగ నిన్నభిషేక మొనరింప
శ్రీకాంత పాణి సరసీజమ్మున జనింప.

చెకుముకిల సంచితో జాలెమొల పట్టితో
కిఱ్ఱు చెప్పులతోడ తుఱ్ఱాయి పాగతో
క్షామాగ్ని జల్లార్చు చెమ్మటల జాలుతో
వరలు గొంగడి మేన వజ్రకవచమ్ముగా.

కాబోవు రైతురాణిని కవి సాదరంగా ఆహ్వానిస్తాడు.

రావే ఓ రైతురాణి ! రావే యలి నీలవేణి !
రావే ఓ కీరవాణి ! రావే దొరసానీ ! రావే దయబూని
రావే ఓ యిందువదన ! రావే ఓ కుందరదన !
రావే ఓ కమలనయన ! రావేమె బిరాన ! రావే సుల్తానా !

అనుపమముల నవయౌవన మత్సర శిల్పాలు దీర్చ
సమ్మరించిడి నెమ్మోమున బువ్వతీవెలు లాస్యమాడ
మించిన స్తనభారమును వహించు నడుము వడకాడ
అంచిత జఘన భరమ్మున నంచనడలు తడబడగా.

తొలకరి పాలుంచవాణీ! కొదవలిగొను కల్యాణీ!
పాడి పంటలను భువిపై ప్రసాదించు శ్రీపాణీ!
ముసిముసి నవ్వులతో నద్దినల బర్వువాల్యాపుల
నొసటందిద్దిన కుంకుమ పసలుదయార్కు లసినగ.

బంతిపూల కొప్పులతో పచ్చబొట్ల యొప్పులతో
బల్లియ కానైపై వెండిబిళ్ళల మొలకట్లు మెరయ
అమృతముగొను మోహినివస నంబలిదు త్రస్థలనిడి
పల్లెపులకింప లోకుల నెల్లసాకు అన్నపూర్ణ
రావే దొరసాని! రావే దయబూని.

విప్రలబ్ధ

రైతులక్ష్మి వచ్చి సానురాగదృష్టుల ప్రియునికై నిరీక్షిస్తుంది.

నాయకుడెవరే! ప్రసూన సాయకుడెవరే బాలా!
కంతుడో! వసంతుడో! జయంతుడో! తెలియగజాల!

బుగ్గల నిగ్గుల రోజా మొగ్గలు విచ్చే సిదగు
నవయౌవన నందనవన నాయకుడెవరే! నిర్జర
నాయకుడెవరే!

మందారపుటందాలను మధురరస ప్రబంధాలుగ
సుందరాధరాంచలముల సుధాపానముల గ్రోలే
నాయకుడెవరే! ప్రసూన సాయకుడెవరే బాలా!

మొల్లమొగ్గలను నవ్వే పల్లవరుస లొకవైపు
చమురాలకు కనువిప్పగు కాటుక కనులొకవైపు
శృంగార రసార్ణవపు తరంగాలను ఈదులాడు
మహో! సమ్ముదశాలో నాలో నాకే తెలియదు.

సంపెంగ సొంపులతో నెయ్యంపు వియ్యమందెడి నీ
ముసిముసిలావే పొక్కిళ్ళపు పసిండి మైదీవియలో
పల్లవాల ప్రసూనాల ఫలసంపదలను గోరితే
చిరమై సుఖ మత్త కేళీముఖమై శుకమై యొప్పెడి.

వెలుపమ్ముల కొల్లయు సుఖనిలయమ్మగు నీముఖశశి
నలచిక చిరహాస సుధాకరజ్యోత్స్నలను ద్రావగ
తాపించి చకోరిక కాముకుడై విరహముగొను
సంకాలపు చెనకే ఘాతలరంభా! బింబాధరీ!

విప్రలబ్ధ

లక్ష్మిని గాంచి రైతు ఆశ్చర్యానందాలకు గురియౌతాడు.

ఏమి గనుచుంటి నేనేమి గనుచుంటి ?
నేనె నాకన్నులను నమ్మలేకుంటి

వనలక్ష్మి నాముందు వచ్చి నిలుచుండెనా !
కనులు దెరచియె మంచి కలగాంచు చుంటినా !

అందాలరంభ నాముందాడు చుండెనా !
బొందితో స్వర్గమ్ము బోయి కనుచుంటినా !

బంగారు బొమ్మలో ప్రాణమే పడెనా !
శృంగారు పడుటనా ! ఏసుచూపె చెడెనా !

పగటె నే చంద్రబింబమ్ము కనుచుంటినా !
ధరణి తెగిపడియాడు మెఱపు గనుచుంటినా !

పుష్పదీపిక నడచి నవ్వి ననుగాంచునా !
మన్నింపు పుష్పలకు మాటలే వచ్చునా !

ఎదలోని మధురోహ లింతిగా మారెనా !
మదిగాంచు కలలె యిమ్మాడిక్కి నిజమాయెనా !

వెలుప్ర కదలింబుట్టు వాలయు శ్రీదేవియో
వలపు పూదోటలో బలిపించు తావియో

ఏమి గనుచుంటి నేనేమి గనుచుంటి
నేనె నాకన్నులను నమ్మలేకుంటి.

విప్రలబ్ధ

రైతు హాలమూని పొలమును దున్నుమని ఆత్మప్రేరణచేస్తాడు.

దున్నవోయి దున్ను మడి దున్నవోయి దున్ను
వడిగల గిత్తలగట్టి హాడా ! హై ! తహో-కెయ్యాన

వంతల మిట్టల బాపి—అంతా సమమొనరించి
అందరకును సమజీవన మందు బాటులో నుండగ.

కాపే లోకమునకంత కాపటంచు కొలువసాగ
కట్టే ప్రాణులకు జీవగఱ్ఱయంచు తెలిసిరాగ

చలిగాలికి స్థాణుడవై వడియెండకు వజ్రివియై
జడివానలు గురిసిన హిమశైల శిఖరముఖ్యుడవై

చెట్టూ పుట్టలగొట్టి రాయి రప్పల నెట్టి
భూసతియెద కరగి వెన్నపూసగాగ పంటలీగ

ముండ్లూ రాళ్ళని జంకక పురుగూ బూచని వెరవక
చీకటనక వెలుగనక సిపాయి బిడ్డవై సాగి

దేహసుఖాలను విడిచి దార పుత్రులన్మరచి
కాననముల నొక తాపసిగా నిశ్చల దీక్షబూని

మన్నులోన మన్నై వరివెన్నొక వెయి విత్తులీయ
మన్నె బంగారుసేయ యన్నపూర్ణ యవతరించ

ఎముకల నుసి నుసి జేసి శ్రమనంతయు ధారవోసి
ధర చనుబాలిచ్చి పెంప ధాన్యలక్ష్మి తాండవింప

దున్నవోయి దున్న మడి దున్నవోయి దున్న
వడిగల గిత్తలగట్టి హడా ! హై ! కహో-కయ్యెస.

రైతు పొలమును దున్ని వానకై యెదిరి చూస్తాడు.

నీవురావోయి ఓ వానదేవా ! నీవురావోయి ఓవరుణదేవా!
ఇంటివరకొకసారి రావా ! మా పంటచేలనుజూచిపోవా !

మెఱపుటంకుశమూని మబ్బుటేన్గులనెక్కి
బడబడా యుఱుములా బాజాలు మ్రోగంగ

సరదాగ మబ్బుల్ల పరదాలు తీసుకొని
రంగారు సింగిణీ రాచగుమ్మము దాటి

గడగడా ఉఱిమేటి పిడుగు రాళ్ళవిదాకి
పచ్చికడవల మబ్బు విచ్చిపోయి కురువాలె

ఘూసతియు ముసురులా ముసుగులన్‌దాలిచి
చిలకయై తనువెల్ల పులకింప చూడాలె

మండూకములు వేదమంత్రాలు చదువంగ
చలిగాలి నీకు సుస్వాగతము లొసగంగ

ఇంటిలో గింజల్లు మంటిలో బోశాము
మింటికేయీ జూచి కంట నీరెట్టాము

బండమీద వరద పాశమే పోశాము
పాండవుల కథలన్ని పాడి తాగ్రేశాము.

పలక నెత్తినబెట్టి బడికెళ్ళు పాపలకు
వానచినుకుల మింటి తేనెరుచి జూపాలె

కోట్ల ప్రాణులు బిలువ కొండెక్కి కూర్చొనక
ఆకాశభవనాల అంతస్థులన్ని దిగి

చల్లనగు నీ వానజల్లులకు తడియైన
మట్టి సౌగంధ్య మెద మత్తెక్క జేయాలె.

ఉరుములతో మెరుములతో గురిసేవానగని రైతు సంతసిస్తాడు.

వచ్చెను వచ్చెను వర్షాలు మా వసుధారాణికి తలబ్రాలు
విచ్చినపూలై ప్రజాముఖమ్ముల వెల్లివిరిసెను మురిపాలు

కత్తులు కత్తులు కలసినయట్టులు
ఉత్తరదిక్కున ఉరిమింది కనుపాపల చెక్కునిమెరసింది
దివి గడగడగడగడ ఉరిమింది
దిశి చకచక మెరిసింది చలిగాడుపు రివరివ విసరింది

పాడుకరువులకు బాణాలు మా
పంట చేల కివి ప్రాణాలు మా
కాపు కన్నులను ముత్యాలు వరి
కర్రిల నోళ్ళకు చనుబాలు

కోడెనాగుత్తై యురికే వాగులు
క్షీరధారలై పారే తోగులు
భూసతి వాసల తాసములాడి
పచ్చిక కోకల పైరు సవరించె

మద వృషభమ్ములు కొమ్ముల గ్రుమ్మచు
మట్టిని జిమ్ముచు అంకె వేయగా
ముదిత మయూరం పింఛము విప్పి
ముద్దుగ నాట్యం సలిపింది.

ఆరవోసిన చీరలవోలె
తూరుపుగట్టం దావులు మేసె
నడచే నల్లని గండశిలలవలె
పడమటిగట్లను గేదెలు మేసె

కమ్మ గొడుగుతో కాపు ఛత్రపతి
చేలలోన భూపాలుండయ్యె
పశుపతియై ములుకోలనుబూని
కరువుల పాలిటి కాలుండయ్యె.

కాపు మొలిచిన వరినారు నాటువేస్తూ పాడుకొంటాడు.

నాటు వేయవోయ్ పొలము పాటు జేయవోయ్
కాటు వేయజూచు కరువు కాలసర్ప విషౌషధుల

ప్రజలందరి నిస్సమగతి పచ్చపచ్చగా నుంచగ
కరువుల వధించు సైన్యముగా వరిపైరులు నిల్వగ

వాన నాని ఎండకెండి వంచిన నడుమెత్తకుండ
పంటలక్ష్మి గొనివచ్చే పల్లకిలై పడుచులొప్ప

కూటికరువు దీరెననుచు కూలిపడుచు తనచెమ్మట
గోట మీటి కోకిలయై పాటపాడు చుండంగా

ఊషరభూమి నొకనాడును నాకలి కక్కురరామని
సంపసవని భూదేవి పదమ్ములంటి వచ్చెననగ

అభ్యుదయ నిరోధక మీ యధికసంతు వలదనుచును
విడివిడి యడుగుం దూరము నడుమున నొక్కొకకట్టను

బలముగల్గి జీవించే కొలదిమంది మైననేమి
బలహీన శతాలమించి ఫలవంతమ్మగు నిటులన

నాటువేసి వరికఱ్ఱల నడుముమంటి నీరుబెట్టి
ఆనందాంబుధి మునింగియాడు జనములెల్లె యనగ

పజ్జ నూరుగంటలేసి గంట పేన గొలుసు విడువ
మన్నె బంగారమనుచు మానవులకు తెలిసిరాగ

నాటు వేయవోయ్ పొలము పాటు చేయవోయ్
కాటు వేయజూచు కరువు కాలసర్ప విషౌషధుల.

సిగ్గులు చిందులు త్రొక్కే నవయువతులు నాటువేస్తుంటే
చుక్కలలో చంద్రుడిలా మెరిసిపోతున్న లక్ష్మిరిగని రైతు.

ఎవ్వరీ చిన్నది ఎంత బాగున్నది
కన్ను యిక్కడనుండి కదలనంటున్నది

పెదవి చెలియకట్టు నొయుగు సిగ్గుల వదలి
నవ్వు ముత్యాల్పోసి నాగుండె కొన్నది
మనసు మనసుకు నడుమ మమత బంధాలల్లు
చిలిపి చూపుల వలను చిక్కించుకున్నది

కనుల చూపులలోనె కనకట్టు నొనరించి
మాట మాటలనెదో మంతరిస్తున్నది
పిల్వకుండనె ఎదలో పీటేసి కూర్చుండి
తనువు మీదేమొ దొరతనము చేస్తున్నది

చక్కదనపూ వయసు చెట్టపట్టాల్ బట్టి
పట్ట పగ్గాల్లేక పరువులిడుతున్నది
గుండె విప్పి మమత గ్రుమ్మరించేదాక
వలపు భారము మనసు నిలుపలేకున్నది

అడుగులన్నన్ను నేనర్పించు కొనికూర్మి
పూజ సేయాలనే బుద్ధి పుడుతున్నది
నెలత కర్పించుకొన నేను నాలోతేను
ఎందుజూచిన తానె ఎటు దోచకున్నది.

రైతుకాపు యువతిని వలచి పలకరిస్తాడు.

ఎవ్వరే పిల్ల మీరెవరె బంగరు భిల్ల
వేరుగా జూడకే పేరేమొ జెప్పవే

చిలుక నవ్వులదాన సిగ్గుపడుటెందుకే ?
కలికి చూపులదాన రంగారు పడెదేల ?
మొలక ప్రాయముదాన మోమాట మేమికే ?

ఒకటి బదులాడవని ఒట్టెట్టుకున్నావ ?
మాటలేరావ యీపూట తినకొచ్చావ ?

చూడబోతే ఎంతొ సుకుమారి గున్నావు !
శ్రమయనక మెఱుపోలె సాగిపోతున్నావు !

చిత్రమా మావేల శ్రీలక్ష్మి వచ్చింది
కొత్తపిల్లను నేను కూలొచ్చి నంటుంది

నవ్వు నవ్వితె వేలు నవరత్నములు రాలు
కాని దోచక ముందె కట్టుబడె నాకాలు
కనుగొంటెనే చాలు కట్టైసె నాకాలు

దొంగచూపుల నన్నెదోచేసి కుంటుంది
నంగనాచిగ తెలియనట్లైె నక్కుంటుంది

వడియెంతలో మోము వసివాడి పోతుంది
కనలేక నామనసు కనుగంది పోతుంది

ఆమెవక్కి మరొకటి ఆగలేదీ యెదను
అవల్ల దోయగ లేను అనుభవించగలేను.

తెలియునే నీకు ఆ చిలిపిచేష్టల పిల్ల
అచ్చంగ ముమ్మూర్తు లామె నీవనజెల్లు.

రైతు రామునిగాంచి లక్ష్మి విరహ పరవశ అయింది.

ఏమనుచు చెప్ప నీగాథ ఎదనేమొ పదరాని బాధ
ఏమయ్యె నామనసు కెపుడిట్లు కాలేదు
ఇదియయ్యెనని చెప్పుకొనగ నోరేరాదు

ఇది సుఖమ్మనుకొంటె ఎద తాపముపెట్టు ?
ఇది కష్టమనుకొంటె యిడువగాలే నొట్టు !
కదలిపోదామంటె కాలేమొ రాదు !
వదల కుందామంటె లోకాపవాదు !

మాటల్లొ చూపుల్లొ మరుగు మందెట్టి
దొరవోలెవచ్చి ఎద దోచుకున్నాడు
రామ చక్కని గుణము రాజంటి రూపు
ఆమాటె నామనసు నుయ్యేల లూపు.

తలపులో నావలపు తమకమెంతో ఉంది
పిలిచితేనో పల్కు బిడియమని పిస్తుంది
అరఘడియ కనబడక అతడుంటె చాలు
నా ప్రాణధనమేగు లక్షల్లు వేలు.

తనచేత చెయిబట్టి తనువు మరపించి కను
అంతలో యెటనుండొ నను సిగ్గు ముంచుకొను
పేరెట్టి పిలిచి నీ కోరికేమంటాడు
మారు మాటాడ నామనసు దడదడలాడు.

నాసామి ననువలచి చూడాలె ననిపించు
చిలిపిగా చూస్తుంటె సిగ్గొచ్చి తలవంచు
తల్లీనమై పోవ తలపు లెన్నో పుట్టు
సామి నను దరిదీయ చల్ల జెమటలు బెట్టు.

బుగ్గపై చిటికేసి ముంగురుల నెగదోసి
జాలి చూపుల రాలు నీలాలు వెలబోసి
మాట మాటల్లొ నా మనసంత కోసేసి
నవ్వుతూ నవ్వించి కవ్వించి కరగించు.

ఏమనుచు చెప్ప నీగాథ ఎదనేమొ పడరాని బాధ.

లక్ష్మీ కొడవలిని రైతు రాముడు దాచిపెడతాడు

ఆ మధురానుభూతినిలా భావిస్తుంది.



కొడవలిని దాచిండు కొంటె నాసామి
తడబడుతు యింటికే తరలు వేళాయె
ఎవరు దీసిరటన్న ఏమెరుగ నట్లుండి
గుట్టుగా జూస్తాడు గ్రుడ్లప్పగించి.



సాటివారందరు చంటిపాపల కింక
పాలిచ్చు వేళయని పరుగెత్తుతారు
ఒంటిదాన్ని నేను ఒక్కరవ తాళజాలన
జంటగల దాయనని సకిలించుతారు.

తానింతలో వెనకో దారంటబోతు
వచ్చియని యామాటి వరికొచ్చినాడి
సిక్కుత్రాగి వేడో నేరుగా బోసుంత
సన్నాయసం గాంచి నవ్వి యుల్లావె

ఇకను పింయాయనా ఏమునష్టము సిది
చిలక గోరెంకల్లె కలిసింది జంట
కొడుకు లెందరనడిగె చిడిముడిం బడనేసు
ఏమితొంపర ముందు కిద్దరే ముగ్గురనె.

ఈమాటవిని తాను ఏమనడు మారాజు
కొంటెగానవ్వి అకోన జూస్తాడు ఈకోన గంటాడు
కుడిచేత రేల్పట్టి కొడవలిని చేబట్టి
కోయకే నన్ను దయజేయవే యంటాడు.

ఇంటికెళిపోవాలె ఇడువు నాచెయి జేగి
ఎవరన్న జూస్తె చాలేమందు రవ్వ ! యన
మనయిద్దరిని యాలు మగలందు రంటాడు.
పనికి రానిదె యంత మనజంట యంటాడు.

మన యిద్దరిది యాలు మగల ఏకాంతమని
మబ్బు చాటయ్యె నదో మాయయని అంటాడు.
కండ్లు బోవును అబ్బె కాంచరాదని చనెను
తెరమాటు గమనో మన తీపి చేష్టంటాడు.

ఏటి ఈ అల్లరి ఇడువు చేయని పెనగ
ఇడువనని ఇనుకేల ముకి బెట్టె నన్ను
నడచి నల్లేదో చప్పుడువచ్చె నదో యన్న.
ఇడువనని ముద్దెట్టి ఎంగిలైతి వనె.

ఆమాట నామదిలో అనుకుంటెనే చాలు
పులకించి ఒళ్ళంత ఉలికి పడుతుంది
సిగ్గొచ్చి పొమ్మంటె చిన్నబోయెను సామి.
తినలేమ నరి ! వల్ల ననతే నదేమొ !

జిక్కీ వెన్నెలలో గూప్పుని కన్నెతలపుని దేలి యాడుతుంది.

వెన్నెల వెలిపాలమున్నీటి కెరటాల
తారకల నాడు చందప్ప నాలోని కోరికల పూలన్నివిప్ప

చందప్పలో నలుపుటందాలు గుడిగట్ట
మొలక మీసపుకట్టు మొగమేదొ పొడకట్టు
నాలోనె ననుతాప పెట్టు ఏమియని
ఎవరితో నుడువ నీగుట్టు.

నెలవంక అందాలు తలపుకొ _స్తే చాలు
నా ఎడద గుర్రిచ్చుతని సవ్వల్ల జంబియాలు
(పల్లు ము _త్తెపుచాలు)
ఏవేవో గు_ర్తు లెద నాడు
ఓయమ్మ ఏటో ఈ మమతలే పాడు.

మబ్బుల్లో దాగాడు మామ చర్యల గంటె
వెనుకొచ్చి కనుమూసి చని దాగు నొకకొంటె.
కనబడును అది దలచుకుంటె నాఒళ్ళు
గగురొడుచు నామాట యంటె.

తారమ్మ వెనకాల తారాడు వెలిమబ్బు
కడనంటు చందురుని గనిసంత సదియేమొ
కొంగట్టి లాగు ఆ కొంటె సవ్వులసామి
అచ్చంగ నాకండ్ల నాడు విందిడుచు
అందాల నాదు చెలికాడు

పక్కనునక జడియాపకు పక్కన్ని శశిగండె
ఏదేదో జ్ఞప్తి జని ఎదనాపు కొనలేక
వెక్కెక్కి ఏడుస్తు ఉంటా ఓ యబ్బ
ఏ భాగ్యవతికో ఆ జంట.

పక్కల్లి సమపనే చూస్తుంటె చంద్రుణ్ణి
కాలిపదుపుల మధ్య కులుకాడు మారాజు
అదియేమొ కన్నుల్లో నాడు
అరక్షణము మరపునకె రాడు.

ముసిపాల చంద్రుణ్ణి ముద్దైన ఏతార
ముత్యాల కల్హారాల ముంచెత్తిన దోసిల
నాననుల కరవారగాంచు నెప్పుడవట
ఎవో పెండ్లి పిందారగించు.

వంశాలలోని అంతస్తులెంచి అంతరువులెంచి వచ్చినేవాలి
మాలవాడులమూ రైతు లక్ష్మిని ప్రేమతో పెండ్లాడినా మంటాము.

ఉచ్చి మేటికె నీకు ఇప్పుటవు సిగ్గు
ప్రేమించి యుద్ధము పెండ్లాడునామె
పలికేవే నాతో బంగారు చిలకా !
తెలుపవే నీమనసు ముత్యాల మొలకా !

నేను నీవాడనై నీవు నాదానివై
ఉంటె వాడెవ్వరేమంటె మనకేమి
మలినమ్ముగాని మన తొలివలపు పావమే
ఊం యనుము నీవు అప్పుడే మనకింక.

ఒకరి మేలును జూచి ఓర్వగాలేని యీ
పాపిష్ఠి లోకముతో పనియేమి మనకు
మిట్టపల్లాల యిక్కట్టు లెన్నుంటేమి
గంగ రత్నాకరుని కలియ కుంటాదె.

తనయిష్ట మొచ్చినదె తినుమనే లోకాన
మనిషి మనసున నుండు మమతేమి తెలియు
చిలుకలకు పంజరాల్ అలరులకు బంధనాల్
గల్పించి మురియు లోకమున కనలేవయుండె.

కులమేల మతమేల గుణమె కారణమంచు
పదవి భాగ్యాలేల ఎవరె ముఖ్యంబంచు
ప్రణయ రాజ్యము లేలు ప్రకృతి దేవత ఒడిలో
తోటి స్త్రీ పురుషులకు హారమిడుదామే.

రాముడు లక్ష్మి వనదేవతల సాక్షిగా పెండ్లి జేసికొంటారు
పెద్దవాళ్ళు వద్దన్న కారణముగా.

మనసుల్లో ఏనాడో మనలగ్నమైనాది
ఒప్పుకోవే లచ్చి యిప్పుడీ మనువు

బతుకు సంసారంపు బండి బరువెంతైన
ఏకమై నాగేటి యెడ్లోలె మోస్తమని
పేర్మినాగటికాడి పెండ్లి పీటలమీద
కూచుండి పెండ్లాడి లేచి వత్తాము.

కొత్త కోర్కెల చీరకొంగుముళ్ళేసుకుని
సరసాలు నవ్వుల్లు సన్నాయిలను బాడ
తరుణి నాకౌగిలిని తాళిబొట్టుగ గట్టి
ఉప్పొంగు మురిపాల ఊరేగుదామే.

మాకుపై పక్షుల్లు మంత్రాలు చదవంగ
తలరాలు పువ్వుల్లు తలంబ్రాలు చల్లంగ
తీవల్లు తలలూపి దీవనలు చెప్పంగ
పచ్చపచ్చని మట్టి పందిళ్ళు వేయంగ.

రాముడను నేనైతె రమణి సీతవునీవు
పార్వతివి నీవైతె పరమశివుడను నేను
అరచేత చేయేసి ఐక్యమై విడమంచు
పసుపు బియ్యముబట్టి బాస జేతాము.

భూదేవి సాక్షిగా గోదల్ల సాక్షిగా
పైదుండి చూస్తున్న సూర్యచంద్రుల సాక్షి
నీమీదనే మనసు నిలచిపోయింది నా
ప్రేమంత నీమీదె పెట్టుకొన్నానే.

వీరిపెండ్లి విధిలేక రైతుపెద్ద లామోదిస్తారు, లక్ష్మీ పెండ్లైతే పసుపుబట్టలతో వెంకన్నదర్శనాని కొస్తానని మొక్కుకుంటుంది.

పసుపు బట్టలతోడ పయనమై వస్తాంటి
ఎంకన్న దర్శించ యెళదామ స్వామి

ఏమి గావాలంచు వెంకటేశ్వర్లడుగ
నేమందునో నీకు ఎరికెనే స్వామి ?

కొడుకు నిమ్మంటావు కొంటె నాలచ్చి
మనయాట (స్వేచ్ఛ) సాగనీదాబుజ్జి వచ్చి

విప్రలబ్ధ

నీ కౌగిటనోలి నీ ప్రేమలను గ్రోలి
చావు తెరుగనినాట వయసులుడుగని వీట
ఎడబాటు అంచేమొ ఎప్పుడెరుగని చోట
స్వామి సన్నిధిలోనె స్వర్గ సుఖమంటాను

నిలువు దోపిడినిత్తు సీలాలనేనిత్తు
జన్మజన్మల మాదు జంట బాపగనీను
ఆమాట నానోట అనలేను వినలేను
ఏడుకొండలవాడ వేడేది ఇది యొకటె.

మాజంట నెడబాపు మాయకాలము దాని
తలచితొంచెనె చాలు నిలిచిపోవును మనసు
పసుపు కుంకుమచాలు పదికోట్ల వరహాలు
అని మ్రొక్కుకుంటాను అందాలరాజ.

## తిరుపతి కొండలెక్కుతూ సతీపతుల సంభాషణ.

చూడలేనే ఎండవేడి నీకష్టాలు
కాళ్ళబొబ్బలు నీవికావు నాఎదవె
ఏడు కొండలనీవు ఎక్కలేవే లక్ష్మి
నావల్లనీడలో నడచిరారాదె.

నీనీడ ద్రాక్కోటి పాడు కాళ్ళివి యేల
కాలిపోతే నయముగాదె నారాజా
నవ్వల్ల పువ్వల్లు నడిబాట బోస్తాము
కాళ్ళనీ ఎండలూ రాళ్ళేమి సేయు.

నాతోడు నీడవై నడచిరావే లచ్చి
నాకంటి పాపవై నక్కిరావే లచ్చి
ఈశ్వరుని తలమీది కెక్కలేదే గంగ
ఎత్తుకుంటా చంకకెక్కవే లచ్చి.

ఏ-షో-బలేమామ ఎక్కమందువు చంక
చంటిపిల్లనె నేను చంకెక్కి కూచోను
నీడనై రాత్రి నిను వీడియుండెట్లాగు
నీకంటి పాపనై నినుగాంచు టెట్లాగు.

సరసంపు నీకంటి చలువ జాలదెసామి
బండలకు ఎండలకు భయమేల నాకు
నవ్వుల్ల మాటల్ల నడచినట్లే లేదు
ఏడుకొండల నపుడె యెక్కితిమి సామి.

కొండమీద ఎక్కిన క్రొత్తదర్శనపు సంతోషంలో

చుక్కల్ల ఆడేటి చక్కన్నిస్వర్గాన్ని
కన్నుల్ల కరవార గంటి తిరుపతిని
అదుగదుగో కోవిలలు ఇదిగిదుగో గోపురాల్
భక్తులెల్లరు చీమ బారులై మూగారు
గుండు కొరిగించుకొని కొండ నామముబెట్టి
గోవిందయని ఒకే గోల చేస్తున్నారు.

గట్టిగా నారెట్ట బట్టుకో ఇడువకే
అటిటు జూడకె లక్ష్మి ఆగమై పోతావు
వారాహ తీర్థాన నీరాడి వొత్తాము
పరిగంగ తానాల శ్రమలన్ని బోవునే.

అవిటోళ్ళు చెవిటోళ్ళు అంధుల్లు కుంటోళ్ళు
చేసికోవే లక్ష్మి తోచినా ధర్మాలు
మనసు బట్టగలేక పాపాలు చేస్తారు
ఎన్నింటి కుడుపవే ఎవరోరి కర్మాలు.

కొండల్లు ధ్వని సేయ గోవిందయని పిల్వ
గంటల్లు మ్రోగింప వింటులేవా స్వామి
అంతదూరము నుండి ఆసపడి వస్తేను
తలుపుదీసి నీదు దర్శనమ్మిడవేమి.

దరిసిస్తే-నేమరుగు నిరుపేద మొరలెల్ల
పిరిగల్ల మారాజు చెవికెక్కవా యేమి
అల కుచేలుని యటుకు లాసపడు నాసామి
వట్టి చేతులతోనె వస్తామె నీదరికి.

## ఏడుకొండలవాని దర్శించి ఏణాక్షి లక్ష్మి ప్రార్థన.

ఏడుకొండలవాడ మూడు జగములఱేడ
కోటొక్క దండాలు కొనవయ్య దయతోడ

మాకోసమై నీవు మమత చేపులు రాగ
వైకుంఠమును విడిచి వస్తివా నాతండ్రి

కన్నబిడ్డలమనియొ కాసు వీసమునీయ
నాల్గుచేతులు సాచి నవ్వుతూ కొంటావు

ఆపదల మొక్కోడ నీపాదదాసులము
కోపపడ కొక్క విజ్ఞాపనము గావింతు

కొండమీదా నీవు కొండకిందా ఆమె
అలక ఎన్నాళ్ళయ్య అలవేలు మంగపై

కొమ్మ నినువలచితే కోరి నినుపిలిచితే
కొండ దిగిరావేమి ఏటి న్యాయముస్వామి

నాథున్ని విడనాడు నాడొక్క యుగమౌను
ఆడదాని మనసు ఆడదానికి తెలుసు

మగనితోడిదె జగము మగువ కేమున్నదిర
ఇది తెలియదా నీకు ఏమందురా దొరా !

అపరాధులము మేము కృపజూడవలె గాని
నెపమెన్న మాకింక నీకన్న గతియేది

మా యాపదలనడచి మాముందుగా నడచి
మమ్మెప్పుడును విడచి మసలియుండకు స్వామి

వడ్డి కాసులవాడ వస్తి మీముడుపుల్లు
కానుము వేంకటరమణ గోవింద గోవింద

లక్ష్మి తరిగొండ వెంకమాంబరాసిన వేంకటాచల మాహాత్మ్యము
గాంచి కొనుక్కొని చదువుకొన కాంక్షపడుతుంది కాని
చదువురాదు-రాముడు చదువుకొమ్మని ప్రేరేపిస్తాడు.

నీవె చదువు నేరిస్తె-నిజంగ ఎట్లుంటుందో
తావి సువర్ణమునుగూడ ధరఎంత పెరుగుతుందో

చదువుకోవె నాలక్ష్మి శాస్త్రిలు పురాణాలు
చదువులు నేర్చినమొగాలు సౌరభాలుగల పూలు

ఆడవాండ్లకేల చదువు అనుకొనియెదవా రాణి
ఆడది మానవజాతికి ఆదిగురువు అదె వాణి

దొంగకు దొరకనిసొమ్ము చదువు చెడని పదార్థమ్ము
ఒకరికి పట్టుమని యిస్తే ఒడిసిపోనిదీ ధనమ్ము

ఇంటికి దీపమ్మట్టులు కంటికి కనుపాపటులు
మణికి సాన ఒరపిడివలె మనిషికి విద్యయె వెలుగిడు

ప్రకాశించు రత్నాలకె బహుళమూల్య మొసగెదరు
చదువుకొనిన మానవులకె చక్కని గౌరవమిడెదరు

చదువులు సంధ్యలు నేర్చిన సదసద్వివేక మ్మొలయును
చదల సూర్యుడుదయించనె సరిమార్గమెదో తెలియును

చదువురాని పశువుపైన ప్రతిచతురి నిధీస్వారే
పదవి భాగ్య మెంతున్నా చదువొచ్చిన దదివేరే

పటునేర్చు విద్యసేవ పూటలోనె నేర్వగలవు
సాటివారుమెచ్చు తెలివితేటలె విద్యలకు నెలవు

చదువునేర్పు సద్వర్తన-సద్వర్తన గౌరవమిడు
సంఘ గౌరవమున మనకు సకలైశ్వర్యములు గూడు.



విప్రలబ్ధ

చదువునేర్చి సంస్కారవతియైన లక్ష్మి పొలముపనులకని
పోయినదై ఆత్మేశ్వరునిగూడి హాయిగా వనవిహారం చేస్తుంది.

ఏమి యగుదాము మనమేమి యగుదాము
సామి నీవూ నేను సంబరముగా గూడి

ప్రేమ పెరిగీ పెరిగి భూమియాకాశాలు
సోముడూ సూరీడు చుక్కలూ దిక్కులూ
అన్ని మనమే అయ్యి ఆడుకుందామా
పున్నె పాపాలన్ని కడిగివేద్దామా.

చిగురులన్ రాగమ్మొ పూలలో భోగమ్మొ
పత్రాల దూగాడు పారవశ్యమ్మొ
అనుభవించగ కొమ్మనై పోదు నేను
నను వరించే తేటి నాయకుడవీవు.

చలిగాలి శీతోపచారములు సేయంగ
అడ్డుగోడలు లేక అన్నిమార్గాలుగాన్
మొగిళులందాగుడు మూత లాడుటకు
జంట గువ్వల మగుచు మింటి కెగిరేమా.

కొండ మేడలమీద కులుకాడుదామా
నదుల సరిగంగ తానాలు జేతామా
పచ్చిగడ్డీ ఇసుక పట్టుపరుపుల మీద
పండుకొని సరాగాన ఉండిపోదామా

రే బవలు విశ్రాంతి లేని గమనాలతో
మధుర హృదయ ప్రేమ మధువు తాగీతూగి
అడ్డు మిట్టల ద్రోసి అన్యజగముల రోసి
ఆనంద సముద్రంలో ఐక్యమైదామా

నాగుండె నీవుండి నీగుండె నేనుండి
నీవు నేనై పోయి నేను నీవై పోయి
నీవు నేనొక్కటై నిల్చిపోదామా
హర పార్వతులవోలె ఐక్యమైదామ

తెల్ల మొహమేసుకొని తేజమ్ము దిగనాడి
మనను గాంచియె పదిమి పహివంగి వడకాడు
ఈ విశ్వమంతనిక చావు జరయున్ లేని
సురలోకమును జేసి పరవశిద్దామా.

దంపతులు వెన్నెట్లో దగ్గరున్న ఏటినీటిలో
బోటుషికారు చేస్తారు.

పున్నమి చంద్రుణ్ణి మనసులో నుంచుకొని
వెన్నెట్లో నెలయేరు వెన్నలా కరిగింది

కన్నెవాగు కలువ కనుగిలుపు తున్నాది
చిన్నిమామను వలలో చిక్కించుకొన్నాది

వంకలెన్నో పెట్టి వయ్యారినడకతో
ఒడియాన అటునిటూ బెదరిపోతున్నాది
సిగ్గుతో ఎటునెటో చెదరిపోతున్నాది

గలగలా నవ్వుల్ల గంపబోర్లించినటు
ఒయ్యారముల కడవ లొలక బోసినయట్లు
కొత్త దంపతు లెవరొ కొసరు గుసగుసలట్లు
మరుని గజ్జెల గుబ్బుమన నేగు సెలయేటు

తలపులెన్నో తేనె తడజిమ్ము తున్నాయి
కలవోలె అవియపుడె కరగిపోతున్నాయి
కడలేని మమతల్లు జడలల్లు తున్నాయి
విడలేక తనచుట్టు సుడిదిరుగుతున్నాయి

కలువలై ఒళ్ళంత కళ్ళిప్పు కున్నాయి
మరువులై నవ్వుల్లు విరిబంతు లేసినయి
పొంగులై వయసూరి పొరలాడుతున్నాది
సరసాల నమృతమ్ము జాల్వారుతున్నది

సెలరాజు చలువ వెన్నెల కరమ్ములజిక్కి
అనురాగపాశాల పెనగాడి చనుయేరు
గండశిలలై పులకగను మహీవక్షోజ
ములజారు మేల్ముత్తెములపేరు సెలయేరు.

లక్ష్మి ప్రియునితో తన ఆనందానుభూతి తెలుపుచు
తన వీడలేని తాదాత్మ్యం చెప్పుకొంటున్నది.

నీవు నను దరిదీయ నిజముగానో మామ
తెప్పెక్కి సర్గాన తేలిపోతుండాను.

ఈగట్టు నీవైతె ఆగట్టు నేనైతె
కలిపింది యిద్దరిని గంగాంటి ప్రేమ
మనతనువులందు జీవనము బోసింది
కడదాక మన అంటు విడవనన్నాది.

పై రెప్ప నీవైతే క్రీరెప్ప నేనైతే
కలిపె నిద్దరి తీపికల లాంటిప్రేమ
కనులలో నెదొహొగరు గలిపించి బులిపించి
ఈ లోకపుం ధ్యాసయే పూర్తి మరపించి
కలిపెనిద్దరి తీపి కలలాంటిప్రేమ.

కల కరిగిపోవునో జలమూరి పోవునో
నిలవలేనో రాజ నినువీడి క్షణమైన
అలయలో తావినై యాకులో వన్నెనై
ఫలములో రసమునై కలిసి యుంటానిన్ను.

నీవు నేను పూవుతావిలా ఒకటైతె
వాడినా ఊడినా వాసనలు పోనట్టి
పకుళ పుష్పంబునై వాసికెక్కేను
చందనపు గంధమై అందగించేను.

నిన్ను గాంచనినాడు నిలిచెనిది మొలకమై
తీవ ప్రాకినవెన్క యేవిధిని నినువీడు
కంటిలో పాపవై యొంటిలో ప్రాణమై
నీవు లేకున్నచో నేనె లేనసజేతు.

లక్ష్మి ఆనందాతిశయముతో పాడుతున్నది హాయిగా.

ఉప్పొంగి చెలరేగి నురుకాడు నామనసు-ఈవయసు
పీడనిసరాగాల పాడుకుందామా.

హాయిగా తెప్పపై ఆనంద లోకాల
దారి బట్టి మనము పారిపోదామా
తెప్పమీదామెక్కి సప్పుడూ కాకుండ
ఉరికురికి యేరునే దొరికించు కుందాము.

ఏరు ఎదలోతులను పారజూచితివా
ఆకాశమంతయై యగుపడుతు లేదా
శశిలోని యమృత మీసెలయేటి యూట
సెలయేటి తీగపై మనప్రేమ పాట.

అలమాటు దోబూచు లాడుచున్నాదేమొ
అందాల రేరాజు నందుకుందామా
చక్కన్ని వాడనని చుక్కల్లొ ఆడేడు
అందుకే నీకాళ్ళక్రిందయ్యి వడకాడు.

తెప్ప తేరెక్కిన గొప్పబంటువు నీవు
దండల్లె సెలయేరు తరలి మునుబోవు
తెరసాప యెగిరింది జయబావుటాతీరు
రెంటి నొక్కటిసేయ రేబవలు మనపోరు.

పాలవెల్లిదుగొ లోపలనాడు జాబిల్లి
నేనిందు గనబడుదు లచ్చిదేవర తల్లి
నీవోడతో నీడ యిష్టమూర్తికి మల్లె
స్వర్గలోకాలల్లొ సాగిపోదామా
వైకుంఠ లోకాల పాలించుదామా.

వరిచే లెసుగుచున్నాయి. వానలు తిరిగి కరువైనాయి. బావులకు
విద్యుద్యంత్రాల దెచ్చికొని విద్యుత్కాంతినిగని
రాముడు లచ్చితో.

విద్యుద్దీపపు కాంతుల వెల్గిపోవుచున్నావే
లక్ష్మీ సౌందర్యము లక్షలలో తేలినదే
కష్టపడిన ఫలమగలము కరువెక్కడిదే మనకు
మనవేల్లో నెప్పుడు మాలచ్చిమి తాండవించు.

రామాలము కేవలనొ సామాన్యపు దినముకాదు
శ్రీమానిని విద్యుద్రుచి జేరవచ్చె నింకపోదు
స్వాగతమ్మిదె విద్యుచ్ఛక్తి జననీమతల్లి
మా పాలిటి కల్పవల్లి మావెన్నెల పాలవెల్లి.

అందని స్వర్గము మనగృహమందే ఇకదిగివచ్చును
నందనవనములు ప్రతి సదనమ్ములోన కనవచ్చును
ఆకాశంబున తారక లవకతవక నున్నావని
విద్యుద్దీపముల వరుస వెక్కిరించుచుండె దివిని.

ఈ తీవియలంబూచు నవెన్నియొ మణిదీపమ్ములు
మారుతహతి మలగవింక మనయదృష్టరూపమ్ములు
ఎంతది మనకిక చంద్రుల ఇంద్రుల లక్ష్యమ్మనంగ
వెలుగులు చేజిక్కెనింటి వెనుకనె పాతాళగంగ.

అగ్ని వాయు వరుణు లెంత యరచినవినలేదు మొరలు
ఇరువదినాలుగుగంటలు ఇక మన సేవకులు సురలు
గగనము మనతోబల్కుచు జగపువార్త లన్దెలుపును
అగుపడి గంధర్వగణము లమర గానముల జిల్కును.

వాయువు మనయాజ్ఞయైన వచ్చి చామరము వీచును
నాకము మనలోకమునకు నంగిలొంగినటు దోచును
ఇనుపగజ్జియల తల్లిని యనుపవలెను ఊరివెలికి
మనదరిత్రతా నాటక భరతవాక్యము నికపలికి.

ఉడుగణమ్ములారా ! మీరుర్వికి వెలుగియెరేయని
కడుప్రియాసపడి భూసతికనెను తారకారాజిని
మహిపై యానందవల్లి మారాకులు వేయుచుండె
ఈ మానవ హృద్వికాసమిటు నవ్వుల బూయుచుండె.

జగన్మోహనకర సుప్రసాదమిది సుదర్శనమ్ము
ఒనరె నిత్యకల్యాణమ్ముర్విని మనకనుదినమ్ము.

కాపు కలుపుతీయగా లచ్చిని పిలుస్తాడు.

క్రలుపు తీయ రావేమె కాపోరిపిల్ల-నీ
కంకణాలు గాజుల్లు ఘల్లుఘల్లు మనగా

పయట నడుముకు జుట్టి చేత కొడవలిబట్టి
దుష్ట శిక్షణజేసె అష్టభుజ కాళికవై

మన భూమియందేమి పరజాతి యాస్వామి
నరికివేసెద నన్ను నారి ఝూన్సీవగుచు

దేవతల దాగాడు రాహుకేతుల వెదకి
నరకు మోహినివోలె పెరికేయవలె తుంగ

పైడి తీవియతోను పంతమాడే మేను
మబ్బులో మెరుపల్లె మసలాడ వరిచేల

పిలువనీ పేరంట మిలుసొచ్చి నట్లొచ్చి
దొంగోలె పొంచేటి తుంగగడ్డిని తెలిసి

నరుల నోళులగొట్టి వరికట్టలను జుట్టి
పెరుగనీయని కలుపు పెరికేయ వలెనింక

నెలవంకలను నవ్వు నీచేతి కొడవళ్ళు
కరువు చీకటి డుల్లకురియు నమృతపుజల్లు.

పొలము కావలిగాయు కాపు ఆకలి కలమటిస్తు చద్ది గొనితెచ్చు
లచ్చికి ఎదిరి చూస్తాడు.

వచ్చేది మాలచ్చిమేనా ? దాని
వయ్యారి నడకలతో వియ్యమందును హంస

నగుమోము పగజూచి పగబట్టి చందప్ప
కొంటెగా సడిదాకి కొంగుగొని యాపిండా

పిలిచి నట్లైతె జామల తోటకెళ్ళితిని
చిలుక పలుకని తెలిసి సిగ్గొచ్చి మరలితిని

కనుచుండె పొదమాటు కన్నెలేడియొ లేక
ననుగేలిసేయంగ నక్కియుండెనొ తానె

కొండెక్కి పిలిచితిని కొమ్మెక్కి చూచితిని
కడుపు మంటల్లోన కాలుచున్నది లంక

ఇంకెవరు దెచ్చినా ఇసమోలె మింగాలె
అది దెచ్చెనా బువ్వ అమురుతమనిపిస్తుంది

నవ్విస్తు కవ్విస్తు నాకండ్ల మునులచ్చి
కనబడితెనే చాలు కడుపు నిండన్నాలు

నాపొత్తులోదింటు—ఊరిస్తు ననుగంటు
ఏమేమొ తానాశపెట్టు—మాటల్లొ
ఎంత దింటినొ తెలియదొట్టు.

లచ్చి చద్దిని దెచ్చి రాముని ఊరిస్తుంది.

లచ్చి వచ్చినాదోయ్ మామా సద్ది తెచ్చినాదోయ్
ఎదిరిచూచు నీకన్నులకూ ఇంకేమొ తెచ్చినాదోయ్

చెలువపు చూపులలో మామా కలువలు పూచినవోయ్
కలికి చూపులా వలపు తేనియల
కావడి తెచ్చితినోయ్ మామ త్రావగ రావేమోయ్

జిలిబిలిమాటలలో మామా చిలుకలు పలికినవోయ్
కలికిపలుకుల ప్రేమపాశపు కలశము తెచ్చితినోయ్
మామా గ్రోలగ రావేమోయ్

విప్రలబ్ధ

తలపుల ఊటలలో ప్రణయపుటలుగులు పొంగినవోయ్
వలపుగుండియలలో సరసామృత ఫలాలు తెచ్చితినోయ్
మామా తొలిరుచి జూడగదోయ్

చెలువపుటంగముల పావురాల్ కులికి యాడుగదనోయ్
దోరవయసు వొయ్యారపు సొరుల కలకండలరుచి
చిలుకలు తెస్తిని ఆరగించరావోయ్ మామా
నారాముడ వీవోయ్, నాదేముడ వీవోయ్

మోజగు నవ్వులలో సన్నని జాజులుపూచినవోయ్
కమ్మని వాసన ముమ్మిరిగొనగా
ఎండకు వాడని దండలు తెస్తిని మెడలో
వేసెదనోయ్ నాఎద గుడిలో దేవుడవోయ్.

లక్ష్మి కాపుచద్దిగుడుచునపుడు మంచెక్కి పిట్టలగొడుతూ
కాపువైపు ఓరచూపులు నవ్వులు విసరుతుంది
వానికోర్వలేక రాముడు

కొంగు నడుముకుజుట్టి పొంగిపడు వయసుతో
శాసించు నగుమోము సరసంపుచూపుల్ల
ఒడిసేల రువ్వబోకే ఆఢాక కోర్వలేనే లచ్చిమి

గాలికెగిరే కురులు కలికి తుట్టాయెట్ట
మంచెగద్దియ మీద వేంచేసి నారాణి
చిలిపి చూపులరువ్వి బలిజేయకే నన్ను
నేనయ్యొ పట్టుబడుదే గురిబెట్ట మానుకో[illegible]చ్చిమీ

కౌగింట కట్టేసి కనుచూపులం గొట్టి
కఠినంగ శిక్షించి కసిదీర్చు కొనరాదె
నీరామునిం బట్టి నిలువుదోపిడి చేసి
నా మనోరాజ్యంపు స్వామినివి గారాదె

అరియుప్పనముగ నీకర్పింతు నాగుండె
కరుణించు దొరసాని మరివేరె గతిలేదు
ఓడిపోయితినంచు ఒప్పుకుంటిని నేను
కనుసైగలో నాడుదే నారాణి గిరిగీస్తె దాటబోనె

మెడనున్న ఒడిసేల గురిపెట్టి కొట్టకే
గుండె పిట్టకుదాకి కూలె నీ ప్రేమోలనే
బిగి సడుముకొని ప్రాణమెగిసి పోకుండాపి
అధరామృతము జిల్కి బ్రతికించుకొమ్మింక.

లక్ష్మి కానలలో చేనుకావుగా నున్న రాముని దరికి రాకపోవుట
కాముని తూపుల గాసిపెట్టు చున్నవి. రాముడు
విరహ పరవశుడై

ఏ జన్మలో నెవరి నెడబాపితిమొ యేమొ
ఈ చేనులో నేను యింటికాడా తాను
కన్నుల్లొ తెలవారు తున్నది—మా
కర్మమింతే నోచుకున్నది.

చద్ది యన్నము దెచ్చి సరసమాడుచు లచ్చి
పలుకరానిగాథ పడరాని ఒకబాధ
ఎన్నడగు పరికోతలన్నది—కొంగు
కన్నీట తడిసి పోతున్నది.

అత్తమామల యెదురు ఆడ బిడ్డల యలుక
వత్తమనరాలేదు పంజరములో చిలుక
పెత్తనమ్మేది నారాణికి—ఎంత
ప్రేముంటెయేమి దొరసానికి.

ఇంటికే దీపమ్మ అందాల రూపమ్మ
రాజులకె దొరకనీ రత్నమాణిక్యమ్మ
కంటిలో పాపయై యుంటెంతొ బాగుండు
క్షణము కనబడకుంటె జగము మున్గినటుండు.

మామ నీకొక మంచి మాట జెప్పనా రాత్రి
మీవంతు కావలికి మీయయ్య వస్తడను
సత్తెమాయన గాదు ఉత్తుత్త మాటలని
నను జూచి కూలిపడి నవ్వుతది కొంటెగా
ఆరూపపుడుతినే యాలెననిపిస్తుంది.

నన్నిడిచిపోలేక కన్నీరు నించగా
ఏడ్తువెందులకనుచు నెవ్వరే నడుగుచో
అదిగాదు కనులబడె నెదొ నలుసనుచు బొంకి
తప్పించుకొాను నేమిజెప్పాలె నాప్రేమ.

రైతురాజు లక్ష్మి రూపురేఖలను దలచుకొంయు తల్లడిస్తాడు.

లచ్చి మాయింటికే లచ్చిమమ్మోరు
మనుషులందరి దాని మాటయేవేరు

నుదుట కుంకుమబెట్ట నదియె పదివేలు
కోటి సొమ్మున్నట్లు కొట్టొచ్చు సౌరు

అదిలేని నాడిల్లు చిలక లేని గూడు
అది వుంటెనే యిల్లు కళకళా మెరసాడు

ఎక్కడున్నావయను చక్కదనమంతాను
ఒక్కటై వచ్చి నాయెడి నొరిగి నట్లుండు

కుత్తింపు రవికలో కుదురైన అసొరు
పదును బెట్టిన రాచమదనుని కటారు

తనువు సింగారమ్మా గుణము బంగారమ్మా
అన్యులంటగరాని అగ్గి ఆ శీలమ్మా

నావైపు చిలిపిగా నవ్వి చూచిన తీరు
భావ మెంతుంటుందో చెప్ప జాలదు నోరు

మేలమాడీ నవ్వి వాలుగన్నుల జాడ
పూల తెప్పల తేలిపోతుంది నాయాత్మ

తొంగిచూపుల మత్తు నగవులన్నిద్యుత్తు
సోలు ఒయ్యారాలు చూడ నోగమ్మత్తు

సొగసుతో ఘల్లుమను చూడ చక్కనిపొత్తు
అనుకొంచునేవాలు అదియేమొ పిచ్చెత్తు.



విప్రలబ్ధ

ఒకనాడు రైతురమణి ఒయ్యారా లొలకబోస్తూ
రాముని దగ్గర కొస్తుంది-రాముడిలా అంటాడు

నాటోలె లేదు నీమనసూ లచ్చి
యేటికే నాతోడ యేరు బందము నీకు

పరవానిగా నన్ను పరికింతువేలయన
వరిపొట్ట కొచ్చెనని చిరు నవ్వు నవ్వితివి

వరిగింజలను వేళ్ళగోని కన్నుమూసికొని
సామియని నుదురాని సరిచేసి యెంచెదవు

అటుకొౌసకు సగపరకు ఇటుకొౌసకు సగమంత
తుంగ కట్టను జీల్చి దొ౦గయని నవ్వితివి

కొ త్తగా బుట్టినా కోడెదూడను జూచి
ఈమంద బెరిగితేం సామి సొమ్మంటావు

నిన్ను విడచి నేను ఎన్నాళ్ళిటుందునన
అనుభవించాలె చేసిన కర్మ కని నవ్వు

త్వరపడితినా నాదు తప్పేమి యయ్యేనన
ఐన తప్పుల కడుపునందెట్టి నంటావు

అందాల చూపుల్ల అమృతమ్ము సేవించి
నీ యొడిలోబండి నిదురోత నేయంటె
ఏల యీతొందర తాళుమిక కొన్నాళ్ళు
జోలబాడీ నిన్ను జోకొడుత నంటావు—తెలిసేనులే.

## రైతు చేను కోతకు వస్తుంది.

వచ్చెను కోతకు వరిచేలు—ఫల
మిచ్చెను గింజకు పదివేలు

కోసుకొనుము పనలేసుకొనుము తల
మోసి కొనుచు జని రాశిగ జేర్చుము

వసుధాదేవిని వరించి దేవుడు
పసిడి యక్షతల పారజల్లెనిక

తుట్టాదాలిచి దొరయై కురియును
కట్టకట్టయును కనక వర్షములు

కుప్పల బంగరు తిప్పల మేరువు
కొప్పుల భాగ్యము చిప్పిలగూర్చుము

కోసుకొనుము నీ చేసే శ్రమకిదె
దాచుకొనక వెలబోసె వసుంధర

పసుపు తీర్థముల జలకమ్మాడిన
బాలింతల నీ పంటచేలనిక

మన జీవిత కథలను నడిపించే
సరస పద్యముల చాళ్ళ వరెన్నల

చీమ మొదలు భూస్వాముల వరకును
రక్షించే వరి లక్షిమి పంటల.

## కాపు వరికుప్పల బంతి గట్టుతాడు.

బంతి గట్టవోయీ ఎదను చింత సేయ కోయీ
ఎంతో కృషిఫలితము నీవంతకు వచ్చును హెచ్చును

చింతామణి భూదేవి సిరులిచ్చే రత్నగర్భ
సంతోషముతోడ చేయిదాచుకొనక ఫలమిచ్చును

దైవము గుడి చుట్టు సరిప్రదక్షిణాలు చేయచేయ
ఫలము పొందుననగ ఎడ్లు వరికుప్పకు చుట్టుదిరుగ

తాను నోట గట్టుకొనుచు దాచి పిల్లల కిడుతల్లి
వోలె మాతలకు బుట్టలు గ్రాలు యెడ్లు బంతిదొ్రక్క

మేటవు గిరిమీద నుండు శ్రీరమణుని వోలె కాపు
గడ్డికుప్పమీదజేరి గడెగడెకును గడ్డి బరవ

పసులమేత మనమేతయు బరాబరిగ వేరుసేయ
బసవన్నకు రైతన్నకు భాగాలను పంచివేయ

పశుల పదము లాశ్రయించి పాడిపంటలుండుననగ
పశుపదహతి రాలెడి వరివిత్తనాల నెత్తికొనగ

బంతిభోజనము సేయుచు ప్రపంచ మానవులెల్లరు
"అన్నదాత సుఖీభవ" యని దీవెనలను బెట్టగ

బంతిగట్టవోయ్ ఎదను చింతచేయ కోయ్
ఎంతో కృషిఫలితము నీవంతుకు వచ్చును హెచ్చును.



విప్రలబ్ధ

రైతు రాలిన వరివిత్తుల కడెమును కుప్పబోసి
తూర్పారబట్టు లక్ష్మిని బిలుస్తాడు.

తూరుపార బట్టరావే అందాలదొరసాని నాయింటి
రాణీ ఓలచ్చి తూరుపారాబట్టు దుమ్ములో నినుజూడ
మబ్బుల్ల చందప్ప మసపేల దిగివచ్చు

లలిగాలి సిరాంగులాగి ఆరడిసేయ
సిగలోని మతెమొగ్గ సిగ్గొచ్చి నవ్వింది

వయసు బరువోపక వడకాడు నడుముతం
బుర కాయ తీగెలా మెరపులా అసియాడ

సిరిగల్ల సీమదటి చెమట ముత్తెపుచాలు
మెల్లమెల్లగా గాలి నిలువు దోపిడిసేయ

రాలు ధూళిని మేలు ధాన్యంపురాసుల్లు
పాలుసీమ వేడ పరచేటి హంసల్లె

చేటతో ధాన్యమ్ము చెరగి రాశోయాలె
వరహాల నొలికించు వరలక్ష్మి దేవోలె

ఎర్రెండల వాడి దుమ్ముగమ్మిన మోము
మట్టిపొరల విడిన మంచి బంగరు ముద్ద

గాలి తరగల్లోన తేలాడు మైదీవ
పైరగాలికి సోలు పైడితీగల తేవ.

కాపు బండినిండ ధాన్యము నింపి ఇంటికి తోలి వస్తాడు.

బండొచ్చె బండివచ్చె రెండెడ్ల చక్కని బండి
నిండు గర్భవతి పోలె బండి వచ్చె నండి

భూపాలుర భాగ్యాలు వ్యాపారుల రత్నాలు
మనపాలిటి శాస్త్రాలు ఈ బండిపైనె వ్రాలు

కర్షకుని చేతికష్టం వర్షాధినేత ఇష్టం
భూజనులదగు అదృష్టం ఈ బండితోనె స్పష్టం

ఎరువులను ధరణిమేసి వరహాల కుప్పబోసె
కరువులను వడితినేసి, బరువైన బండివచ్చె

జనతాన్న వస్త్రదాత పశుపాలనాగ్రనేత
మనకెల్ల ప్రియభ్రాత రైతన్నకెపుడు జోత

ముచ్చలకు చర్మమిచ్చి ముండ్లల్లొ తాను జచ్చి
వడి బండిగట్ట పారు బసవన్నలకు జొహారు

ధరకెవడు జీవనాలు తమి ధారవోయుచుండు
ఎవని దయ చేలుబండు వర్షన్న మ్రొక్కులిండు

రైతన్న లేనిరోజు మన జీవితాలు క్లోజు
పోతన్న రైతురాజు వారంచె ప్రజకు మోజు.

రైతు బండ్లనుండి వడ్లు తోడి గుమ్ములు నింపుతాడు.

త్రోడండి తోడండి వడ్లు తోడండి
భూదేవి గోదల్లు మనకు తోడండి
ఘోరమగు లేమికి గొయ్యి తోడండి
పైరు పచ్చలకెపుడు నీరు తోడండి.

నింపండి నింపండి గరిసె నింపండి
గుమ్ముల్లు నింపండి కొట్లు నింపండి
జలదాలు వర్షించి చెరువు నింపండి
కాపు లోకానికే కడుపు నింపండి.

పోయండి పోయండి తోడిపోయండి
బండ్లనుండి వడ్లు తోడిపోయండి
కరువు కన్నులలోన దుమ్ము పోయండి
తనువొంచి చెమ్మటలు ధారవోయండి.

వేయండి వేయండి మెత్తు వేయండి
ఋణదాత నోటికి తాళమేయండి
కాలు కడుపుల కింత అన్నమేయండి
చింతల్లు చీకుల్లు తీసివేయండి.

రైతు రామునికి లక్ష్మి ఒక మహమ్మదీయ జాతికి చెందిన పిల్లయనియు, పోలీస్ యాక్షన్‌లో దాని పెంపుడు తల్లిదండ్రులకు దొరకెననియు, వారెటునుండియో ఇటుకు వలసవచ్చి జీవించుచు లక్ష్మిని తమ కన్నకూతురుగానే చెప్పుచున్నారనియు ఎంచి దానివలన తాను పొరపడినానని బాధపడి లక్ష్మిని నిర్బంధంగా తల్లిగారింటికి తీసికొనిపోయి మరల తీసికొనిరాకుండా ఉంటాడు. అపుడు లక్ష్మిపడే విరహావస్థ కొడుకు పుట్టినంక వస్తానని రాని భర్తదలచి విప్రలబ్ధయై.

ఎటుమరచి యుండగలను నాసామి
నెటువిడచి యుండగలనూ.

విప్రలబ్ధ

నేను కెళుతానంచు చెప్ప నాదరివచ్చి
కనులొప్పగించి నను కనుచునే నిల్చుండు
నేనుపని ఎటుబోయె చెప్పు మామాయనిన
నను నేన మరచితని చనలేక చనుచుండు.

ఉండు లక్ష్మి నీకు ఒక రహస్యపు మాట
చెప్పేది యున్నదని చెవిచెంత మోమునిడి
సిగ్గు రోజామొగ్గ బుగ్గలం బెదవొడిసి
ముద్దెట్టి నవ్వుకొని మురిసేటి మారాజు.

ఎవరిచేయి మరింత ఎఱ్ఱనో చూతమని
ఎవరి రెట్ట మరింత ఎక్కువో కొల్తమని
వలకేల నారెట్ట కొలచినట్లె నటించి
గిలిగింత జేసి నను కిలకిలా నవ్వించు.

ఆసలక్ష్మి యిద్దరాల్మగల నిడుపెవరొ
కొలుచుకుందామంచు కొంటెగా మును నిల్చి
ప్రణయ పరవశుడగుచు బాహుబంధము సాచి
ఓగి కౌగిటంజేర్చి నగుచు నను ముద్దాడు.

చెప్పు లక్ష్మి నాదు చేతులో ఏముందో
తెలిసికొని చెప్పితే వలచి యడిగినదిత్తు
తప్పితివి నాముద్దు తగదీర్పు మీవంచు
క్రొసరి ముద్దులవాన గురిపించె మోవిపై.

పెండ్లి సలుగాటలో పెదవుల నదిమిపట్టు
ఆకులను పోకలను నందుకొను వేళలో
కరుణమాలీ పెదవి గాయపరచీ నాకు
కన్నీరు తెప్పించి కవ్వించు నగుసామి.

నీవె నాప్రాణమని నీవె నాహృదయమని
నీవె నా సకలమని నీవెనా స్వర్గమని
నమ్మించి నన్నే తృణమ్ముగా భావించి
మరల కలనైన నామాట దలపనిరాజు.

లక్ష్మీ ప్రసవించి పగళ్ళిళువును గంటుంది—తన యందాల పాపనుగని.

అందపువిందిడు పాపా! అద్వైతానందరూప!
ఏ లోకమునుండిరాక ఎవరిబిల్పు నీకేక.

మాతో పరిచయములేదు మాబాసయె నీకురాదు
నీవన ప్రాణములిత్తుము నీమాటన పడి చత్తుము
ఎవరిగాంచి యీహాసము ఏమాప్రేమ విలాసము
ఇటు ముష్టిబిగించి పెనగు దేమా యుద్ధావేశము.

గులాబీలు నీబుగ్గల కళాకాంతి మాయకుండ
స్థలాలు సవరించుకొనుచు చలాకీగ నవ్వి మురియు
మాదు ప్రణయ పంజరపున్ మరుగయి వచ్చినచిలుకా
మా ప్రేమరసాల యంటుమామిడి చిగురుల మొలకా!

అతి రహస్య దేశంలో అతుకుల బొంతగ గలసే
ఆలుమగలకే కాని అన్యుల కక్కరరానీ
మా మలిన ప్రేమరసం మంచిజేసి వడబోసి
నీమోహన రూపంతో నిఖిలజగతి కందజేతు.

మా ముద్దుల మూటగట్టి మనుజుల నోరూరింతువు
మా నగవుల దొంగిలించి సూనవృష్టి గురిపింతువు
ఏతీరున ప్రేమించిన ఏకత్వము నందలేని
మా తనువుల నొకటిజేసి మహికంతకు జూపించితి.

నీవుంటేనే భవనం-నీవులేని యిల్లు వనం
నీవే మా ప్రేమధనం—నీవే మా నందనవనం
మాదు భవిష్యాంధకార మార్గదర్శ దీపమ్మవు
మామమతకు జీవమునిడు మచ్చుతునక రూపమ్మవు.

మానవతయె నీదుకులమమాయకతయె నీదుమతం
బాగుగ మాటాడువారె బంధుజనులు నీకుసతం
మారీచుని మాయలేడి మతిదోచని రాముడవో ?
ఆదిశేష సర్పముతో ఆటలాడు దేముడవో ?

పరులా నావారనుటలు పాపం పుణ్యమ్మనుటలు
ఎఱుకల రూపపు మలినపు మర్కలు నుంతయునులేని
యమాయకత్వము దేవుండని చాటెడి ఓపాపా !
మాయాతీతంబగు నీమానస హంసకు జోహారు.

భానూదయ కిరణమ్ముల పైడితీవ యల్లికవో
నవ్వుల పువ్వుల గురిసే నందనవన మల్లికవో
వెన్నెల కాంతులె నీతో కన్నుముక్కు మొగమూనెనొ
చెన్నగు సుమపల్లవతతి జీవమ్ములు పుంజుకొనెనొ.

సంతోష సముద్రమ్ములు గంతులిడును నీనగవుల
స్వేచ్ఛా గంగాపూరము చెంగలించు నీయడుగుల
కాలుకు మన్నంట దెండకన్నెరుగవు మహాభోగివి
చెదరని తపస్సమాధిని నిదురించుచు నగుయోగివి.

మధురముగా జోలపాడు మాతృ సామవేదధ్వని
చిట్టిపొట్ట తడుపునెపుడు క్షీరామృత గంగాధుని
ఏమిలోపమని ఏడ్తువు ఇచ్చట నీకొకభయమే
ఈ మమతాప్రపంచమది యెన్నన్నా దుఃఖమయమొ?

ప్రసవించి పదిరోజులైనా పట్టినైనా జూడరాని పతిని గురించి బెంగగొని పందిలిపై వ్రాలిన కాకమ్మతో కబురంపుతుంది.

బేగిరమ్మని చెప్పవే కాకమ్మ ఆగలేనని తెల్పవే
ఎందరుంటే నేమి అందాల మారాజు
వద్ద లేకుంటె నా ప్రొద్దె చీకటిపడును.

కాకమ్మ కాలితో కబురు జేసేదుంటె
గడియలో రెక్కలను గట్టుకుని వాలుదనె
అనినోడు తానన్న దినమేగె రాలేదు
ఒళ్ళెట్లగుండెనో సల్లగుండాలెదొర.

తక్కిన్న చుట్టాలు చుక్కలైతే నాకు
చందమామవు నీవు అందాల నారాణి
నిన్ను జూడనిరోజు అన్నమే పోదొట్టు
ఎన్ని జన్మాలదో ఈబంద మన్నాడు.

నేనంటే చాలు తన ప్రాణాలిడుస్తాడు
గుండెబగిలెను సామి ఉండలేనిక నేను
మావోళ్ళకేమెరుక మరి నాల్గురోజుల్లు
ఉండిపొమ్మంటారు ఉసురోసుకుంటారు.

ఎండనక వాననక ఏళనక పొళనక
చెమటోడిపి కష్టమ్ము చేసి చేసొస్తాడు
కలి అంబలో తాగి గడియాగ కెళుతాడు
రాత్రి అడవిలో బండు రాతెట్ట గున్నాదో.

పగలు రేల్ రెండొకటి యగుదాక నిదురోము
రేల్పవల్ ఒకటిరెండగు నిప్డు నిదురోను
తననిడిచి రేబవళ్ళను నిద్ర ఉంటొట్టు
అన్నమ్ము నీళలని యంటె ఓకిళ్ళట్టు.

తమరుబెట్టిన మెళ్ళి దండగడియమ్మపుడు
ఒడ్డాణమనిపించ ఒదలయ్యె నను మిపుడు
పట్టుచీరలు నగలు పెట్టి ముకియు నవేల
ధరియింప మ్మురిసేటి దొరగారె దయమాల.

మమతల్లుగల ఆలుమగలు కనబడ చాలు
ఎడతెగని కోతతో ఎదఎందుకో గోలు
నినువిడచి బ్రతుకలేనను ప్రేమ యెటబోయె
కనసన్ని కలలోని కలవరింతలె యాయె.

కన్నీటివర్షాల కరగిపోనీకఠిన
పాషాణ మెటులయ్యె పండంటి ఆమనసు
కన్నబిడ్డను జూడగానైన రాలేదు,
చిన్నోడు తనపట్ల జేసిన్న తప్పేమి ?

ఇద్దరిలొ మనబిడ్డ యెవ్వరిని బోలునన
నావోలె ఉంటెనా నిన్ను పూజిస్తుంది
నీవోలె ఉంటెనా నన్ను దయ జూస్తుంది
ఇద్దరిని పోలెనా ఏకనారీశుడగు.

నావోలె ఉంటెనా నను సమర్థిస్తుంది
నీవోలె ఉంటె నీవైపె వాదిస్తుంది
ఇద్దరిని బోలుంటె త్రెంపివేయున తంట
మనము కలహించుచో నన భేషనుచు నవ్వె.

లక్ష్మీ ఎన్నికబుర్లంపినను రాని తనప్రియుని దరికి వన్నెల
రామచిలుకతో తన యార్తినంతయు దయబుట్ట
చెప్పుకొని జాలిపడి అంతవరకు
పోయి రమ్మంటుంది.

అందాల చిలకమ్మ అందెవేయిస్తానె
పాలు బట్టిన జొన్నచేల విందిస్తానె
పగల బండిన జామపండ్లు దినిపిస్తానె
పోయి: నాసొదజెప్పు పున్నెముంటది నీకు.

ఒంటి స్తంభము మేడ వృక్షశాఖల నీడ
జంటతో కులుకాడు పెంటి నిను చెరనిడిరి
దారేషణము శకుంతముల సొమ్మంటారు
సీరోదనము మనిషి కేరీతి చెవిదూరారు.

కారడవిలో మనుచు కాయగడ్డల దినుచు
తాపసులవలె నొరుల దయతోడ గనుగొనుచు
విష్ణుపదవీథులన్ విహరించు ద్విజరాజ
శుకరూప కులదీపస్తుతి సేతునే యోజ.

రాయబారము సలిపి రమణి రుక్మిణిగలిపి
తొలిప్రభావతి వలపు ప్రద్యుమ్నుతో తెలిపి
కాపురాల్ నిలుపు నిను నీపతికి నెడబాపి
పట్టి—యీపంజరపు బందెలో నిడుపాపి.

మగనియెడబాటులో మగువయేగతి గుందు
అనుభవించెడి నీకు అర్థమౌనసుకొందు
వెతలేని వారలకు వెతజెప్ప కతతొను
నారాజుకడకేగి ననుగొంచు పొమ్మనవె.

తొలి యశుదొక్కండు తెలివిమాలి యదేమొ
మనిషి మాటలె రాని మబ్బుతో కబురంపె
కదలాడు జీవనము కలదేమొ యనుకొనెను
పక్షిరాజా—నీకు పలుకు జీవనముండి.

ప్రమదకు గలనాళ్ళ నిను బంధించు పంజరపు
చెరను విడిపింతు నాచేతి యుత్తరమిత్తు
నారాజుకందించి నను మురళిబుధి ముంచ
మనికి గలనాళ్ళు నామది నిను దలచుకొందు.

అందాల రంభవై విందిడెదు చెలువాళ్కు
కలికి పల్కుల రామచిల్క పచ్చల మొలక
తరుణి శారదచేత తరిబీతు పొందితివి
మరుని గజ్జెల గుజ్జమను కీర్తి జెందితివి.

తొలిదిక్కు తననుదుట తిలకమ్ము దిద్దుకొని
నీవిజయ సిద్ధికై నివ్వాళి బట్టినది
ఇదియే శుభోదయము ఇదె సుమ్ముహూర్తమ్ము
కదలి రమ్మిక రెక్క విదిలించి లేలెమ్ము.

వినువీధి చీకటుల వృక్షాల సూర్యుండు
పగలూని కాల్చుట నౌ పొగలు మబ్బులు గ్రమ్మ
నాకలోకపు టింద్ర నగరి సౌధాలలో
అగరు ధూపము విడిరొ పొగలు మబ్బులు గ్రమ్మ.

అప్సరస్తారకలు ఆకాశగంగలో
జలకమాడగ, నెంచి పలురంగు చీరలను
విడిచి దరినిది నీటబడిమున్గ వారి చీ
రలె వన్నెమబ్బులయి వెలిగె నదె యుదయాద్రి.

లతలు వృక్షములెల్ల రాత్రి పచ్చికసెజ్జ
కుతుకమున పెనగాడి రతిదేలి యలసెనో
చెమటవౌడమె ననంగ హిమబిందువులు రాలు
మలయ మారుత సఖులు మెలమెల్ల వీచెదరు.

నిశలెల్ల విరహాబ్ధి నిమ్మంచు మిత్రుగని
కమలినియె హిమబాష్ప కలితాక్షులన్వగవ
చీకటులు తుమ్మెదల మూకలై పద్మినిని
ఇనునితో మూకభయ మిప్పించుమని యేడ్చు.

కమల సుమసన్నరస కావ్య కోశము జదువ
రసికులన తేనెపైర రవళించు తేంట్లెల్ల
దాచిపెట్టిన ధనము దోచు దొంగలవోలె
భల్లూకముఖు తేనెపట్టు కొల్లంగొట్టు.

అతుకనీ దంపతుల యంతరంగాలట్లు
కలయకయె చను బండిగాడాల లక్షించి
పంజరములోనుండి పరువు పరువున నేగి
అలసటం దీర్చుకొన నడవిఁ గొంచెమ్మాగు.

టేకుటాకుల గొడుగులో కొంత తలదాచి
తీగటుయ్యాలలో తూగాడుచును లేచి
వన వినోదములతో తనియింపవే యెదను
మును వనిని గడుపు జీవనమున కిడుమిపడస్య.

అడవిపండులు తాము అడుసుమడుగులనుండి
మట్టిగంధము వొంటబట్టించుకొని లేచి
కడలిముగ్గిన పుడమి పడతి బంధముబాపి
సరస సంశ్లేష సంగతిదేల్చునటు దోచు.

మబ్బు వాహానములన్ మహికి బిల్చెడి కేకన్
సరిపింఛముల సహస్రాక్షులైన నెమిళ్ళు
చక్రాలం గూడుకొని సొగసు నీలాంబరపు
టాకారమై యెగయున్న దోచు వనిలేళ్ళు.

రాత్రి వనలక్ష్మి పారిజాతములనంగ
క్రోల్పులుల్ పొదరింట్ల గురకలిడి నిదురించు
వనలక్ష్మిపై పూల వానల్లు గురిపించు
నన చిత్రవిహగాలు నవనీజముల వ్రాలు.

పల్లటీలను వేయు మల్లు నాకృతులగుచు
కోతిమూకలు చెట్ల కొమ్మలపై దూకాడు
కడలేని విరహాబ్ధి గతి దోచు గగనమును
ఈది రెక్కలతోటి కాదనక వెసదాటి.

అటునుండి ఒకమైలు అరిగితేనే చాలు
అగపడుచు నుండు మాపల్లియ పరిసరాలు
శాంతమ్ముగా నేగ సాయంతనమ్మును
ఆపల్లె సొగసప్పుడు నే చెప్పగాలేను.

అపరాబ్ధి రవి ఈదులాడు చున్నట్టులుండు
చెరువులో తానమ్ము చేయు చున్నట్టులుండు
చెవినేదొ గుసగుసలు చెప్పుచుండును గాలి
అపరదిశ కుంకుమల నలికి పూయును సంధ్య.

అపరాబ్ధి నాదిత్యు డంతరించుట గాంచి
నినువీడి క్షణమేని నిలువలేమేగకుర
యని కొలని ముకుళించు నంబు జాతములెల్ల
కేలెత్తి మొక్కి బతిమాలు చున్నటుదోచు.

ఆడాడ వరికుప్ప లాకాశముల నొరయు
బంతుల నోర్కితల నైపడి వర్షము గురియు
ఆకలిని బోకార్చు నమృతబిందులలాగు
పాల్దాగి జొన్నచేల్పరవశించుచు నూగు.

పసులు రంకెల, గరువుపై దుమ్ము జిమ్మొకట
కొసరి ఎద ఆవులోగన కోడె తరుమొకట
మాటేసి యాబోతు మల్లయుద్ధము సేయ
ఆటాడు లేగల్లు అందాల వడెబోయు.

గగన లక్ష్మియు భాను ఘనవియోగమ్ములో
హారములొలిచి పెట్టియలలో పడేయునన
విహగపంక్తులు వ్యోమవీధులం బయనించి
గూళ్ళు చేరగబోవు వేళ్ళయగు నంతంత.

విశ్వప్రకృతి మిత్రు విరహమ్ము గనలేక
సంజవన్నెల చీర సంత్యాగమొనరించి
మాసిపోయిన కోక మైదాల్చు కొను ననగ
మసక చీకటులల్ల దెసలెల్ల నలముకొను.

అస్త్రాద్రి సానువుల సమరు రంగస్థలిని
అరుణ సంధ్యా యవనికాగ్రమున నటియింప
సందిపై నెక్కుచను నటరాజ మూర్తియన
పసులకాపరి యెద్దుపై స్వారియై చనును.

కొట్టంపు చూరుపై కూర్చున్న కాకిజత
రెక్కమొదళుల విప్పి ముక్కుతో గోకికొని
ముక్కుముక్కు ఒరసి ముదమార తమితీర
అతిప్రశాంతముగా ప్రకృతిశోభ గను హాయి.

కడుపుబ్బ పులుమేసి కనుదోయి నరమూసి
కొట్టాన నెమరేసి కునికేటి మన ఆల
పొదుగు నెత్తురుగ్రోలి మదమెక్కు పిణుందురుల
పొడిచి ఏరేయాల పుణ్యముంటది చాల.

అమ్మ పాలిస్తుంది అవల చాలిస్తుంది
తమ్ముడౌ తువ్వాయి దగు నోరుగొట్టి నా
కపిల పాలిస్తుంది ఎపుడు పాలిస్తుంది
మావంటి రైతులకు గోవులె దేవుళ్ళు.

పాడి పంటలు గోవు నీడలోనే సుమ్మ
మాలచ్చిమేదైన గోలచ్చిమే నమ్మ
రెక్కలును బక్కలును రెండు చల్లంగుంటె
కుక్కలెన్నీ దింటె కూటి కరువేటంటె.

గోవుల్ల సేవల్లు ఏవంచు జెప్పాలె
కవళ మన్నము దొరికి అవని జనములకెల్ల
కరువు తప్పిందంటె కారకులు ఎవరన్న
అవి ముందు మేమెనుక యని సకల ప్రజలకెరుక.

నందులట్టు జను పసులమంద కోడెలు ఆలు
ముద్దు గుల్కేడి వాని మూపురమ్ములు వ్రాలు
నల్లపిట్టల చాలు నవయువతి వక్షోజ
చూచుకమ్ములన దోచి దోచుకొను మనకనుల.

తననంది మూపెక్కి చనుచుండె నేపురము
శివలింగ రూపమని చెన్నారు మూపురము
శుక భరద్వాజ ద్విజకులమ్ము సేవింపు
కొచ్చెరన ఎడ్లపై వ్రాలు పక్షుల గుంపు.

చలువ బట్టల మూట చాకెతలు గొనిపోవ
కంబళుల మూటలకు కనుగుట్టె నోయనగ
గొట్టెమూకలు ఒకేగోల చేస్తుంటాయి
కాలి ధూలిం దిశల కనుగప్పు చుంటాయి.

పాలు చేపులురాగ పయటకొంగులు తడువ
కూలిపడుచులు ఇండ్లకుం జేరగా నడువ
తుర్రికిపడ బిగిచనుల్ కొంగు నడుముకుజుట్టి
పడుచు లేగుదురు నీర్కడవలం దలపెట్టి.

ఆ ఏరుదాటగనె యగపడును మాచేలు
ఆకలికినై నాగుమట నాల్గు నిమిషాలు
పచ్చల్ల ముక్కరై పంటలచ్చికి నీవు
కర్రల్లపై వ్రాలి కదలాడు తుంటావు.

మన జొన్నచేలలో దినమంత రాత్రంత
కర్ర భుజమున బూని బుర్రమీసాలతో
కదలకుండా నెపుడు కావలుండొక మనిషి
అదిరి పోబోకు సుమి బెదురు బొమ్మ అదొకటి.

చూపు గురి నిడి మరుని విండ్లేయు చే సూటొ
చూపు గురి నొడిసెల గుండ్లేయుటదె సూటి
శృంగార వీరాల రంగరించిన కనుల
కాపు పడుచులు మంచె కాపుంద్రు జాగ్రత్త.

కడుపు నింపికొని ప్రక్కనున్న దానిమ్మ
పండ్ల కొమ్మన వ్రాలి పలుకరింపు మొకింత
ముక్కుతో నాపండ్ల ముద్దాడ వోయమ్మ
పక్కుమని నగి నీకు ప్రాణమిస్తాయమ్మ.

అచట నిను కనుగొంద్రు హాని యగుననుకొన్న
దాపు మామిడి కన్నతల్లియనుకొని నమ్మ
ఆకులందాకుగా చిగురలన్ తొగరుగా
కడుపు నందిడి నిన్ను కాపాడు నది సుమ్మ.

బావిప్రక్కన జామపండ్ల చెట్టున్నాది
ఒక పడుచు పిల్లట్టు లూరించు నిన్ను అది
బావినాపండ్ల కొమ్మల బింబములు పడును
రవి కూడ్చి నీరాడు రమణులై కనబడును.

ఇనుని తాపమువలన కనుల చీకటిగ్రమ్మ
పడియున్న సుకుమార ప్రకృతి సుందరినోట
గగనమాతయు తనదు ఘనకుచమ్మును పిండి
పాల్పోయుననఁ శశియొ పండువెన్నెల గ్రాయు.

నెలపాలకుండనపు డొలకబోతురె వారొ
వెన్నెల వరదయై వెసబారు నెలయేరు
నెలరాజు చలువ వెన్నెల కడమ్ములజిక్కి
అనురాగ పాశాల ఫెనగాడి చనుయేరు.

షష్ఠి చంద్రుడు తాను చదల చుక్కల తోడి
తెల్ల పిల్లలకోడి తిరిగినట్లుంటాడు
వెన్నెలయను పాలవెల్లి దరిచినవేళ
వెన్నముద్దయి తేలు చున్నట్టు లుంటాడు.

సాయంతనపువేళ స్వర్గ నందనవనుల
పొదల మల్లియ పూలు బూచె ననుతారకలు
సంధ్య వాకిళ్ళాడ్చి చల్లి దిని నచ్చరలు
తెల్ల చుక్కల ముగ్గుతీర్చి నట్టులు వరలు.

వెన్నెల నిటుదలచు కొన్న చాలు శుకమ్మ
అనుభూతులెవో కత్తులై కోయు నాఎదను
దుఃఖమేఘాల్గ్రమ్మి దొరలు నశ్రుల వాన
అశ్రు వర్షములో నవని చీకటికోన.

నెలబాలునెత్తుకొని నెలయేటి బాలెంత
ఓహోహో యంచు జోగలబాడి నిదురుచ్చు
గనులలో మణులద్ధి గర్భాన ముత్యాలు
మినుకులీనెడిలీల మెరయు చుక్కలచాలు.

లక్ష్మి తాను తెలవారినంత రాముని దరిజేరుమని చిలుకకు,
ప్రేమతో ప్రియుని పరిచయము చేయుచున్నది.

చిలుకమ్మ క్రొమ్మావి చిగురు పచ్చలకొమ్మ
వినవె నానుడి రాత్రి కనుమూసి నిదురించి
వేగినంతనె లేచి స్వాగతము లిడు చేల
విందారగించి మా సుందరుని కనుగొనవె.

పెదచెరువు కోరెంద పొదలకడ చేనుంది
ఆచేనుగట్లలో ఆలమందల దోలి
మనసు నామీదుంచి మంచెపై తనువుంచి
చేలవ్రాలే చిలుకచాలు దోలనె మరచు.

చెక్కిటను చేయుంచి చినపోయి చూస్తాడు
నిట్టూర్పు సెగలకు అట్టుడికి నట్టుడికి
లోలోన కుమిలి యింట్లో చెప్పుకొనలేక
సామి బెంగెట్టుకొని సగమయ్యి ఉంటాడు.

మూరెడెళు—పూరొమ్మ చేరెడేసి కళ్ళు
కోటవెట్టిన ముక్కు కొట్టొచ్చు మోముకళ
అచ్చంగ శ్రీరాము లవతారమే అనుకొ
శాపమేదో కాని ఈపుటుక బుట్టిండు.

•

స్వారి బండెక్కితే తేరెక్కు అర్జన్న
తారుమారు జేయ తరము గాదనుకొనుము
మీసమ్ము మీద చెయ్యేసి మంచెననుంటె
ఆరాచ గద్దెక్కు మార్రాజులే సాటి.

చేయెత్తు మనిషి ఇక చెప్పలేనారూపు
తలచుకొంటె చాలు తనువు పులకలు దేలు
లచ్చియని పిలుపు వినవచ్చి తానేయనుచు
వచ్చి చూతును గదా వట్టి గుమ్మమెయుండు.

ఒకనాడు పొలమేగి ఒట్టు మామా నన్ను
కొనిపోను అయ్యె వొచ్చెనటంచు కొంటెగా
ఏడ్పించి ఏడ్పించి యేహి హాళక్కాలంటె
చెక్కుగిల్లుచు నీకు శిక్షయిదె యని నవ్వె



ఫి. ప్రఅ బ్ధి

నాయెనుక కొంగట్టి నడచినట్లే యుండు
నా చుట్టు దిరుగుతూ నవ్వినట్లే యుండు
తానొడిలో బంచె నే తల నిమిరి నట్లుండు
కలలో నీడలో తానె కనబడుచు నెపుడుండు.

కనులు మూసిననేని కనులు దెరచిన నేని
కర్ర బుజమునబెట్టి కిఱ్ఱు చెప్పుల దొడిగి
రెచ్చగొట్టే కనుల కుచ్చు పాగామూగ
అచ్చంగ తనమూర్తి వచ్చి ముందరనిల్చు.

నాతోడనే కదా నాస్వామి కీశ్రమలు
అన్నమెఱుగని సామి కెన్నాళ్ళు కష్టాలు
మందావు దప్పెనని సందు జే సూకోని
ఈడకొచ్చి నన్ను యెంటగొని పొమ్మనవె.

ఒకక్షణము నన్నిడిచి ఉండేటి వోడేనె
బలిమి బంధాల లోపల కట్టుబడె గాక
మాప్రేమ తలపోస్తె మనసెట్లొ పోతుంది
చెప్పలేనే గుండె చెరువు గొంతుక నిండె.

రైతురాణి తనపై ప్రియున కేదో అనుమాన మొచ్చినట్లు
తెలిసి ఇట్లా ఉత్తరం రాస్తున్నది.

ప్రాణమొంటి ప్రణయ భావమ్మె స్మృతిరాద
ఇన్నాళ్ళ విడ హృదయ మెటులొప్పె నోనాథ
ననుజూడకుంటె ఒకక్షణ మాగలేకుంటి
పాషాణమై పోయె నీస్వాంత మటులాంటి.

ఓర్వలేక స్త్రీల కొాక నింద గల్పించి
పండంటి కాపురము పాడగుట తమిగాంచి
లోలోన మురిసెదరు లోకుల్లు కాకుల్లు
అది నమ్మెదురు పురుషులగుట మీకదిచెల్లె.

హృదయేశ నా ప్రేమ హృది నెవరి పూజింతు
ఎదగోసి నాకు నేనేరీతి జూపింతు
నీవు నేనై తెనే నే బల్కు నమ్మెదవు
వేరైన మన ప్రేమమునకె సంశయమొదవు.

శ్రీరాముడానాడు సీతను త్యజింపడే
తనకీర్తి కొరకు సత్యమునే వధింపడే
ప్రజమెప్పులకు పాటుబడు రాజు కదిచెల్లు

నేను నవ్విన నవ్వె నేనేడ్చినను ఏడ్చి
ననువీడి యుండలేని తనమ్ము జూడగా
నీవు నేనే కాక వేరెవ్వరగుదువని
నిను నేను నమ్మినది నీటిమీది వ్రాలె
గంపంత కన్నిడుకొ కాంచెడిని పరమాత్మ.

## ఉత్తరం రెండవ భాగము.

పిల్లవానిది జ్ఞప్తిరాదా నే లేక ఇల్లంతయును చిన్నబోదా
చేయరానీ తప్పు చేసితేమొ నేను—పసి
వాడేమి చేసెనని వదిలి వైచితిరయ్యా

వానిలో నీరూప వైభవమ్ముల గాంచి, ప్రాణాలు
నిలుపుకొని బ్రతుకుచుంటిని స్వామి—ఈపిల్ల పోష
ణయె నాపాలబడకున్న—పృథ్వినిదివరకు నాపేరెలేకుండేది

మమతగల మానవుని మనసుంటె నీలోన
మన ప్రేమ గడియలో మాయ మయ్యేదేన
నీవు నేనై యిదే నాగుండెతో నేను
దేని దాచక విప్పినా నిజము చెబుతాను.



వి. ప్రలబ్ధి

నమ్మితేసరి నీవు నమ్మ కుండేదుంటె
బాధపడి దేహ మాత్మతో వేరగును వింటె
తప్పు చేయక ముందె. తను దిట్టు జనమనుచు
వెరచునాతడు వట్టి పిరికి వాడనుకొనుము.

సత్యమునకే వెరువ జను నంధ జగతికే
సత్య స్వరూపుడే నిత్యమీ యెదనెరుగు
బట్టగాలిచి మీద బారవేయును జనము
చెట్టాగు నెటుగాలి బెట్టకుండా యనును.

త్వరపడిన త్వరయెపుడు చెరుచు నిన్నేముందు
నిజము నిలుకడ మీదనే తెలియనగు నెందు.

రైతు ఏటి ఆవలి పల్లెకు కోడెల వ్యాపారానికి వచ్చినాడని తెలిసి లక్ష్మి ఏటికడ నావవాడు లేకున్నను దోనె వేసికొని కలియవస్తుంది—ఆవలియొడ్డున నున్న రైతు వారిస్తున్నాడు—వద్దని హెచ్చరిస్తున్నాడు.

ఉండు లక్ష్మి ఒద్దు యీ సాహసపు పోక
ఆగులక్ష్మి ఇదేమి అప్రమాణము రాక

ఊళ్ళు కూళ్ళే మ్రింగ నుప్పొంగి చెలరేగు
ఎఱ్ఱి వానీ నడక ఎట్టెటో యేరేగు

ప్రకృతి యాకలి గొంచు వికటాట్టహాసాల
నాల్కలను సాచి యిటు నడచి వచ్చును వేల

కసిదీర్చు కొనుటకై కాచేయ పరుగెత్తు
పగబట్టి చను నాగు పామోలె వస్తుంది

గట్లు కోస్తూ దారి చెట్ల గూలుస్తు వడి
గోదలను కడుపునం గొట్టుకొని పోతుంది

గాలిరేగి వెఱ్ఱి గోల జేస్తున్నాది
కలియబడి నిలువెత్తు అలలు లేస్తున్నాయి

కురులు రేగెను పరిట కొంగు గాలికి లేచి
కొట్టుకొని పోతోంది పట్టు దప్పోడతో

ప్రాణాల తోడనా పరియాచకము లాట
మానులక్ష్మి నీకు మతి పోయెనాయేమి

అంట ముట్టగరాని అగ్గి నీశీలమ్ము
నీకు వ్రేలిడి చూప నెవని యబ్బతరమ్ము

కఠినాత్ముడను నిన్ను కష్టపెడితి క్షమించు
గడియేని యికనిన్ను విడిచి యుండను సుమంచు.

లక్ష్మి పడవమీద బయలు దేరుతూనే రైతు వాక్కులకు
మాట చెబుతూంది.

ఉండలేనూ మామ ఉండుమని యనబోకు
ఉండేటి ఓపికే ఉడిగిపోయెను నాకు

ఈయేరు దాటొచ్చు నీవేరు బంధంపు
విరహాబ్ధి నింక నేవిధి దాటుదు తలంపు

కన్నీటి మున్నీట కాలి చచ్చుటకంటె
నిసుగనుచు చల్లగా మునిగిపోదీ యేట

నిను వీడి బ్రదుకుటే నిజమైన యాచావు
నిను జూచుచుం జచ్చుటన నాకిదే బ్రదుకు

నా ప్రాణమన నీవె, నదిని జొరబోకొట్టు
నదిని కాలిడితివా నను జంపుకొన్నట్టు

ఇంటిలో నామూరు చంటిపాపను గొంచు
కంటి పాపగ దాని గాపాడి రక్షించు

మామ నా తుది కోర్కె మన్నింపు మీదీని
మహినుండిపోయి నీమది నుండి పోతాను

మరొక జన్మెత్తి ఓమామ నిను గలిసేను
సిరిగల్గు నీమోము మరువ జాలను నేను.

## ఏరులో మున్గిపోనున్న లక్ష్మిని జూచి కాపు విలాపము.

ఏమి జేయుదు లక్ష్మి యెంత జెప్పిన వినక
ఎంతపని జేసితివి ఏమనందును నిన్ను

సుడిలోన జిక్కితివి చూడలేనో లక్ష్మి
గడియలో నిక ఓడ తలక్రిందు లై పోవు

ఏమిజేయుదు నింక నెందు బోవలె నేను
ఎవరు రక్షకులు మన కెంక పేళుడు దక్క
మామా ! లక్ష్మి ! ఓ మామా ! ఓ లక్ష్మి !

ఏడు కొండలవాని వేడుకొనవే లక్ష్మి
తల క్రిందులై ఓడ నిలువ లేకున్నాది
మామా ! లక్ష్మి ! మామా ! లక్ష్మి ! (అబ్బా)

ననుదురాత్మని వీడి మునిగి పోతున్నావ
కనలేను నాజన్మ కాలిపోనూ లక్ష్మి
మామా! లక్ష్మి! మామా! లక్ష్మి!

మునిగిపోయెడి నిన్ను గనుచుంటినే కాని
ఆదుకొనలేనైతి బూదిగా నీమేను
లక్ష్మి! లక్ష్మి! లక్ష్మి! ఓ లక్ష్మి!
(పెద్దపెట్టున ఏడ్చును)

మనలేను నినువిడచి మందభాగ్యుడ నేను
(తల బాదుకొనుచు)
మందభాగ్యుడ జాతి మణి దక్కనే నాకు

బంగారమంటి నిను పాపి నాకెడబాపి
నంగనాచీ యేరు మ్రింగి నీళ్ళను ద్రాగె

నీవు మున్గుటలన్న నన్ను ముంచుటలంచు
తెలియ జాలక పోతి వలచినిన్ మృతి పిలచె

పగ బట్టి విధి మమ్మె పగలె చీకటి గ్రమ్మె
జగతి నాటకములో మిగిలె తుద చీకట్లె.

రైతు రాముడు లక్ష్మి ఏటిలో మునిగిపోయినపిదప విచారంలో ఇలా తలపోస్తాడు.

ఎవరనేను ఎచటనుంటి ఎచటినుండి ఇటకువస్తి
ఇచటినుండి ఎటకుబోదు ఇది తెలిసినవాడెనాస్తి
మరణము మరణము మరణము మహినెల్లరికిదె శరణము
చివరి జయము చీకటిదే చీకటి వెల్గులకు రణము.

చీకటి చీకటి చీకటి—వెలుగురాదు ఇక ఈకుటి
కాళరాత్రి ఈ చీకటి—కాళీగర్భపు వేకటి
నల్లని మహిషపు రూపము నల్లని యమప్రతాపము
నాల్గుదిశలు శూన్యమ్ములు నరకబాధ, దైన్యమ్ములు.

కాటువేస్తె తిరుగనట్టి కాలసర్ప మిదియేనా
జీవనమను పన్నీరును చిల్కేను బూడిదలోనా !
ఇది నిద్రయొ ఇది నిధనమొ ఇది నరకమొ ఇది నాకమొ
మేలుకొనుట లేనినిద్రా కాలపు కర్మ విపాకమొ.

నాప్రేమలు నాస్నేహము నను వీడని వెటులేగను
స్నేహము లింకకముందే జీవజ్యోతెటదాగెను
ఏవాయువు దీనినార్పు ఏశలభము దీనిమ్రింగు
రేపులేదు దీనికింక మాపురాదు ఘుమిమునింగె.

ఈ పూవులలో వాసన లెచటనుండి వచ్చినవి
పూవు నేల వ్రాలగనే తావి యెచట జచ్చినది
లతాసుందరీ తలపై లాస్యమాడు ఈ పూవును
పతా దొరకకుండ నెవడు పాతాళమ్మున ద్రోయును.

విడువలేను నిన్నన్నది విరినితావి వీడెనెట్లు
కనులో కనుపాపనువలె కాజేసిన దెవ్వడిట్లు
పూవు నేల పడియున్నది తావిమాత్రమే లేదు
అల్లరులోని సారమంత నారగించె నేజోష.

వెన్నెల నవ్వేను కలువలు విప్పేను శశి కానరాడు
ఉన్నాడని యాకాశమునుండి యెవడో మాటాడు
కాన రాని ఈ చంద్రుని కాళరాత్రి యెటు మ్రింగెను
'హా యువు మాయమ్మయ్యెను వార్తరాదు ఇక నింగిని.

ఇంతేనా జీవితము ఇదియేనా జీవనము
మంచుగడ్డయై కరగుచు మాయమ్మగు నొకదినము
అంతులేని జలధిలోన నరుగునెటకు ఈనావ
అవలియొడ్డు జూచిరాగ అసలే లేదా త్రోవ

ఒక్కనాడు తెగసరుకగ ఉద్యానము పెంచనేల
చూరుకగ్గి బెట్టుటకై సుందర భవనమ్ములేల
పాత్రలోన జీవనమును పడబోయుట బోర్లేయుట
వాగువాగు ఇదియేనా ప్రభువు దనియు బొమ్మలాట.

నాటకమును యథార్థమని నన్నేటికి నమ్మించుట
నాటకముల యాటలలో నేటికి మమతలు పెంచుట
పాత్రను నాకొసగె నెవడు? సూత్రధారి కానరాడు
విషాదాంత నాటకములె వేయుచేల యేనాడు.

కాలమేఘ జాలముపై కనబడు నొక మెఱపేదో
నీలమేఘ మది యుఱుముచు నింగినెల్ల నడయాడు
ఆకాశమె నాయిల్లని ఆసపడెను మేఘమ్ము
ఘనము కురిసి చనునెచ్చటి కరిగెనొ శంపాలతాంగి.

జలదరూప వ్యష్టి జలము జలనిధి గలిసెను వెలిసెను
విద్యుద్వల్లీకాంతులు విశ్వశక్తి లీనమయ్యె
గడగడనుఱిమే గర్జన నగనములో నిదురించెను
హరిధనుస్సు రంగులన్ని యర్కుని కరములదాగెను.

దివ్వె వెలిగినంత సేపు తెలియనగును నేను నాది
కను ప్రమిదల జ్యోతిమలిగె కానరాదు ప్రపంచమే
గాఢనిద్ర లోననుంటి నాకునేనె లేకయుంటి
ఆసినాస్తి వాస్తవమది యంతా యింతేనేమొ.

పరమపురుషునకు నివియొక పచ్చీసుల పావులేమొ !
నిలుపుటవలె ఆటలోన మలుపుట తన వంతేమొ
అతనిచేతి పందెములో అదృష్టముందో పావుల !
మననాడెడి వేటయదియె అతడాడెడి యాటయగునొ.

ఒక విప్రుడు రైతు కలలోవచ్చి ఈ క్రింది విధముగా బోధించి మరుగైపోతాడు. ఆ ప్రబోధమువిని లేచుసరికి లక్ష్మి ఎదుట ఉంటుంది.

నీవెవడవు నీవెవడవు నిజంజెప్పు మానవుడా !
నిజముగ మానవుడవీవు నీజాతియె మానవత–
మమత మానవునిసొమ్ము అది యతనికి సహజమ్ము
మమతవీడు మానవతయె దానవతగ మారునుమ్మ.

సాటి మానవుండేడ్చిన సరసనుండి నీవేడ్తువు
తోటిమానవుడు నవ్విన తుష్టినొంది నవ్వుదీవు
నావంటివె సకలాత్మలు నాకువలెనె సుఖదుఃఖాల్
అని తలచెడి నీమమతలు అతిమృదువగు ప్రేమలతలు.

ప్రేమయే దేవుండనియెడి పెద్దలనుడి నీవేదము
దేవుండంతటఁగలడను భావము గురుప్రసాదము
స్వార్థపరుల చేతిలోన జాతి మతమ్ములు బడుచో
మానవతనె విభజించును మమతా ప్రేమల త్రెంచును.

రకరకాల ఆలయాలు ఒకేమట్టి భేదాలు
రకరకాల యుడుపులెల్ల ఒకేప్రత్తి దారాలు
మానవకుటుంబ మొకటను మమతావేద ప్రబోధము
మత కుల భేద వివాదము మానవతకె ప్రమాదమా.

ఎన్ని నాటకపు వేషాలేని మధ్య వేసినవే
నిత్య జీవితమ్ములోన నీవు మానవుడవు నిజము
శిరమైనను గడ్డమైన కొరిగించుము పెంచుకొనుము
మానవత్వమును మాత్రము మార్చలేవు తెలిసికొనుము.

ఎన్ని రంగులను బూసిన కన్ను ముక్కు మొగమదియే
రకరకాల జాతులైన సుఖదుఃఖా లొక్కటియే
అన్ని రంగులను గలిపిన నది యగునొక తెల్లరంగు
ఆలరంగ దేదియైన పాలరంగ దొక్కటియే.

భాషలెన్ని మార్చిననున్ భావమ్మది యొక్కటియే
భూషలెన్ని దీర్చిననున్ పుత్తడి తళుకొక్కటియే
సంకుచితత్వము స్వార్థము శత్రుత్వమ్మును సృజించు
మానవతా ప్రేమమ్ములు మహి మిత్రుత్వము బెంచును.

వివిధజాతి వృక్షమ్ములు విపినమ్మున కలిసి మెలగు
జాతి యొక్కటేయైనను సాటినరుని ద్వేషింతువు
జాతి మతాతీత ప్రేమ సర్వేశ్వరుడని తెలియుము
మానవతయనం బ్రేమమె దానిద్వేషి హరిద్వేషి

రూపము గలదనిన నేమి రూపములేదనిన నేమి
వసుధనున్న ప్రాణులెల్ల వానిరూపములె కావా !
దేవమందిరమునకన్న భావమందిరము గొప్పది
సేవింపుమి యచటనున్న చైతన్య ప్రభుదేవుని.

కనులుమూసి ధ్యానింపకు కనబడు చీకటి భూతము
చైతన్యప్రభు దేవుని సేవింపుము కనులుదెరచి
పరిశీలింప నరూపియు బహురూపియు నతడె చూడు
కల్ల కపటములులేని కష్టజీవులతనిగూడు.

చైతన్య ప్రభువర్యుని సేవ వీడి నిర్గుణుడని
ఆదిమను సుతుల్ పరులని యష్టమ గగనమును వేడ
రేయి బవలు మొరబెట్టిన ఓ యన దొకసారిగూడ
అచట నతనికిడు పీఠమ్మనవరతము ఖాళీయే.

తనచే సృష్టింపబడిన తనయులైన మానవులను
మత జాతి విభేదాలిడి మనవారని పరవారని
ఆత్మీయుల వీడి యంధులై జడముల గొల్చుటగని
చేష్టలుడిగి శిలయై నిలిచెను దేవుడు మందిరమున.

అందమెల్ల చంద్రునకే అర్పించెను దేవుడనిరి
అమృతమెల్ల చంద్రుసుండి యారగింత్రు సురలనిరి
అమృతమేది యందమేది యతడుండెడి స్వర్గమేది
కానరాని విషయాలకు కలహించుటలన నవ్వరె.

కాల్చినను బూడ్చినసున్ కడకు మిగులునవి ఎముకలె
మరోజన్మముంటేమి సరి యది లేకుంటేమి
గుడ్డుము కడుపులో గ్రుడ్డు కొనకది ఆడదొ మగదో
కానరాని విషయాలకు కలహించుట లన మూర్ఖత!

లక్ష్మి ఓడతో ఏటిలో గొట్టికొనిపోయి కొంత దూరములో సంధ్యా వార్చుకొనెడి విప్రునకు కనబడి రక్షింపబడుతుంది. ఆ విప్రుడు లక్ష్మినిగాంచి నీ భర్త నిన్ననుగ్రహిస్తాడు గ్రహించుతాడు. నీవు ఆయురారోగ్య భాగ్యాల వర్ధిల్లగలవని కలకాలము సువాసినివై సుఖము లనుభవిస్తావని ఆశీర్వాదించి ఆమెను ఊరు ముందరివరకు తీసికొనివచ్చి మరలి పోతాడు. లక్ష్మినిగాంచి రాముడు విస్మితుడై కన్నీరువిడుస్తు కౌగిలించుకొంటాడు. లక్ష్మి రామునిగాంచి ఇదివరలో నేను విప్రలబ్ధనై యుంటి. ఇప్పుడు నేను నీకు విప్రలబ్ధనై కలిసికొంటినని యా విప్రుడు రక్షించిన యుదంతమును ఆనందంగా చెప్పుతుంది. రాముడు లక్ష్మి బ్రదికి వచ్చినందుకు సంతోషంతో గంతులేస్తూ పాడుతాడు వేంకటేశ్వరుడే ప్రసాదించె ననుకొంటాడు.

వచ్చింది నాలక్ష్మి వచ్చింది నాలక్ష్మి
చచ్చి పుట్టి యముని క్రనుగట్టి జయకొట్టి

నానోము పండింది నాయిల్లు నిండింది
నా అదృష్టపు జీవనజ్యోతి వెలిగింది

తల్లి బోగొట్టుకొనె దౌర్భాగ్య డీపట్టి
అనుకొంటి కల్లజేసెను దాని నాచిట్టి

నాభాగ్య మేమందు నాకయ్యె కనువిందు
నాదు ఆశాలతలు నవ్వు పువ్వులబూచె

పోయిన కండ్లరుదెంచె నవజగమ్మగుపించె
కటికచీకటి యినుని కబళించి వెలిగ్రక్కె

కొట్టివేసిన చెట్టు కొమ్మ నవనవలాడె
గతిలేని పక్షిసంతతికి గూడౌనగూడె

జడునిపై వేంకటేశ్వరుని కృప ప్రసరించె
కుంటివానింటికే గోదారి యరుదెంచె

మధ్య వచ్చిన జాతి మతముల్లై కథలౌను
మమతగల మానవత మహి నెప్పుడొకటౌను.

ఇద్దరు కాపుదంపతులు పిల్లవాని నెత్తికొని ముద్దాడుతూ
విజయం ప్రకటిస్తారు.

అందాల పాపాయి కందమ్ములకు హాయి
పాప యుంటెను వెల్గు మనదైన కనుదోయి

మన నందనవసంపు మొలక యీ పాపాయి
మన ప్రేమ పంజరపు చిలక యీ పాపాయి
బహు తపమ్ముల మేల్మిపంట మన పాపాయి
బాలచంద్రునకు మేల్జంట మన పాపాయి.

పాపాయి నుదుటిపై పారాడు ముంగురుల
నిండుచంద్రుడు దాగు నీలాల పరదాల
ఉత్సాహవంతమై యుబికియాడు మొగాన
ఉరుకులాడుచునుండె నుజ్వల భవిష్యాలు.

పాపాయి నవ్వులం బలక ముత్తెపు సరుల్
పలుమారు వజ్రాల పరిహాసముల నాడు
తారలను దరిదీసి తోరణాలను గట్టి
అందాలముఖ శశికి హారాల జతగూర్చు.

ఊయేల చిలకను చేయెత్తి పిలుచుచు
ఊఁ ఆఁ యనుచు ముక్కులుబ్బించి ముచ్చటిడు
నోటిలో ప్రేలమాయికపు పసి నేత్రాలు
ఆ పాలబుగ్గలం దానంద సముద్రాలు.

పడుచు లేచుచు నురుకు పనియేదో పాపాయి
ఎదురుగాలికి కనుల నెగయు నీలి తురాయి
ఏరాజ్యమేలునో యీ దిసమొల సిపాయి
శ్రీరామ రక్షగా జెలగునెపు డబ్బాయి.

సమాప్తము.

# అ ను బ ం ధ ము.

రహస్యంగా జనము లక్ష్మీ మహమ్మదీయ మతానికి చెందినదని
తెలిసి తూలనాడుట రాముని చెవి బడుటచే
యిలా భావిస్తాడు.

ఓ దేవా ! నిజముగ నీవుండుచోటు కెదిత్రోవ
ఏమతమది సత్యముగా నీదరి జేర్చెడినావ !
సర్వశక్తిమంతుడవును సర్వజ్ఞుడవును నీవ
మాకోసము ఈమాత్రము మార్గము జూపగలేవ.

వేదము నీపలుకేనట బైబిలు నీపలుకేనట
ఖురాను నీపలుకేనట పరస్పరవిరోధాలట
దేవా ! నీవున్నావా ! ఉండియె చేస్తున్నావా
తగవులాటబెట్టి మాకు, తమాష జూస్తున్నావా.

మతమునుమదముగమార్చుచు మహామూర్ఖులగు గుండాల్
నరమారణ హోమబలికి తెరచిరి యజ్ఞపుకుండాల్
ఇట్టిసోమయాజుల కీవిచ్చెదవా స్వర్గసుఖాల్
నీవు దయాళుడవందురు ఏవిధి హింసను సైతువు.

మతవాదులు నీతోడి మంతనాలు మాటాడి
ఇపుడిపుడే నినువీడి ఇలపై దయచేసినట్లు
పరాత్పరునకున్ నిజమగు ప్రతినిధులము మేమేయని
తలాతోకలేకుండా తలాఒకటి ప్రవచింతురు.

మతాచార్యులెల్లరు నీ మక్కువగల బందాలే
సరిపడదొక్కరికొకరికి సవతిపోరు చందాలే
మూర్ఖత గలహించుటకై ముందువెనుకలను జూడరు
స్వీయమతేతరులతలలు కోయుటకును వెనుకాడరు.

ఇదిచూస్తూ వింటూంటే ఇదేమిటిరబాబు వీరి
దేవుడొద్దు మతమొద్దు జీవిస్తేనే చాలివన్ని
అబద్ధాలే యనిపిస్తే అబ్బురపడ పనిలేదు
మాతప్పిదిగాదు ప్రభూ మతమూఢుల తప్పుఇది.

మతమునేర్పునది అహింస మతమునేర్పు విశ్వప్రేమ
మతము స్వార్ధమెడలగొట్టు మత మాత్మను చక్కపెట్టు
మదమునేర్పునదిహింస మదమునేర్పు విద్వేషము
మాకు తెలియకడిగెదము మతమా మదమా వీరిది.

అంతటనీవుండెదవట అసలే కనబడవేమి
ఐతే యిదిఅబద్ధమని యనజాలనురా స్వామి!
కనబడు రూపములనుండు కానరాని యాత్మడవని
మనుజాకృతిలో వినునే కనుగొని సేవింతునవని.

అన్నిరూపములునీవై యలరినపుడు సగుణుండవు
అన్నిటిలోనున్న నీవు ఆత్మాకృతి నిర్గుణుడవు
భిన్నాకృతులం దేకతనున్నదిట్లు నీవేరా!
కన్నారన్ విశ్వరూపిదా నిను గాంచితిలేరా!

మతము దేవుడంటేనే మౌనమూను సైంటిస్టు
అవసరమును బట్టి మతపు అండగోరును నాయకుడు
నామత మొకటే వైకుంఠపు తెరువను గురువర్యుడు
బ్రదుకు దెరువె దేవుండని ప్రవచించును సామాన్యుడు.

దేవుండొకడేయనుచును తెల్పెను సకలమతమ్ములు
ధరణీప్రజలెల్ల వాని తనయులె అన్నలు దమ్ములు
వసుధైక కుటుంబముగా వరలుతాను దేవుండును
సహోదరులె కలహించిన జనకునియెద వుండగును.

అవనీగృహమును బిడ్డల కతడు సమానముపంచెను
ఒకరియాస్తి ఒకరుదోచు టొప్పదనుచు శాసించెను
పెద్దవాడు చిన్నవాని ప్రేమజూడ ధర్మమ్మనె
ప్రేమనాస్వరూపమ్మనె ద్వేషము సైతాననియెను.

భిన్నమతములొకేబడిని చిన్నపెద్ద తరగతులు
అన్ని ఒకేజ్ఞానాంబుధి నంతరించు నుపనదులు
అప్రమేయుడగుదేవుడు అవధిలేని యాకాశము
వానిమతపు కొలబద్దల న్యూనపరచుటవివేకము.

పరుడెవ్వడు లేడనుటయె పరాత్పరుని గుర్తించుట
పరిమానవు ప్రేమించుటె స్వర్గములో వర్తించుట
అన్యత బోధించేవారంతా మోసం గురువులు
ఐక్యత ఛేదించేవారందరు భూమికె బరువులు.

స్వార్థము విడనాడజేయు చక్కనిసూక్తులె వేదము
అటు సేయని ప్రార్థనలన ఐంద్రిజాలిక వినోదము
కలహము నేర్పెడిగురువులు గడ్డినిదాగిన బావులు
ఆగురువుల నమ్మశిష్య లజ్ఞపశువులగు జీవులు.

మతముపేరు జెప్పుకొనుచు మడిగట్టుకొనగనేల
కులమువేరెయనుచు అడ్డుగోడల నిడుకొననేల
ఒకరికొకరు పరులమనుచు యుద్ధములో కూల్చుకొనిన
హారములో చిట్టచివర దారము మిగులును బేల.

మతమిడుపరలోకపు నమ్మకముల సుఖములొకరికే
జాతియొ యీలోక ప్రత్యక్షసుఖము లందరకిడు
పరలోకము నొసగు మతప్రాబల్యము లిటనేటికి
తలఛోపిని పదతల రక్షలుగా జేసెదవేటికి.

రాజు బంటు రాణి భృత్య లొకేనాటకపు పాత్రలు
ఆట రక్తిగట్టింపగ నందరు తమలోమిత్రులు
నాటకరంగమ్మన కీనలుగురు ముద్దుకుమాళ్ళు
నలుగురికిని దొరియకున్న నాటకమే విచ్చుళ్ళు.

# జై హింద్

కాపుదంపతులు తమకుమారుని పుట్టినదినమున ఉత్సాహముతో
సుత్సవము చేయుచు అభినందించుటకు వచ్చిన జన
సమూహాములో ఆనందపరవశులై పాడుకొంటారు
ఆనాడే గాంధీజీ పుట్టినదినమౌతుంది.

జై హిందని ఒక్కసారి చేయుడోయి నినాదము
ఇది గాంధీప్రసాదము ఏలకోయి వివాదము.

హిందూ ముస్లిం బౌద్ధులు ఈసాయీ సిఖ్ జైనులు
అందరు ఒకతల్లికొడుకు లాతల్లియె 'హింద్' మాత
చిన్నా, పెద్దా, అనకా, కన్నకొడుకు లందరిపై
సమానముగ నాభారతి అమృతవృష్టి గురిపించును.



విప్రలబ్ధి

దిక్కులెల్ల పిక్కటిల్ల దిసలెల్లను మారుమ్రోగ
ఒకేకంఠమై ఏబదియొక్కకోటి నాదమ్ముల
పిడికిలిచేతులనెత్తుచు వడి సింహకిశోరములై
జై హిందని మొగులుముట్ట చేయుడోయి నినాదము.

మతము వేరె అనిఅరచి మాతృప్రేమనె మరచి
జన్మతోడవచ్చినట్టి జాతిని బలిజేయుటలో
మనమాతయె హిందూస్థాన్ మరొకపేర నదెభారత్
భారతీయ దేశమ్మిది పౌరసత్వమిట వారిదె.

ఒకేతల్లిగర్భమ్మున నుదయించిన సోదరులు
అకట మతము మార్చుకొనినయంతలోనె వేరగుదురె
మతభేదము సోదరతను మార్చలేదు ఓభాయి
మతము మధ్యవచ్చినదోయ్ జాతి మాతయిచ్చినదోయ్.

హింద్‌దేశ 'ఖానా' దిని ఇతరదేశ 'గానా' లను
బాడెడి దుర్మోహులార స్వమాతృ విద్రోహులారా
దేశవృక్షమూలములనె, తినేచెదలు పురువులారా !
కాలు చేతరాచివేయు కాలమ్మును దెచ్చుకొనక.

భారతీయులదే యెపుడీ భరతభూమియనిపిలిచి
మతావేశముల నడచి హింసామార్గము విడిచి
వేషభాషలను మరచి దేశమ్మొకటని తలచి
ప్రాంతీయ విభేదమ్ముల పాటించక మునునిలిచి.

ఒకేమట్టిలోనుండి ఉదయించిన యీఘటముల
సంబంధమునేమరచి సహోదరులె పరులనుచే
ఒడలెరుగని శివముండునె కడలియలలు వేర్వేరే
మమతాప్రేమలద్రెంచిన మానవుడే దానవుడు.

నిన్నటి హిందువునునేను నేడు ముస్లిమైనాను
అలిమినో బలిమినో రేపేయగుదునేమొ క్రిశ్చియనును
మనసుమార్పుతోవచ్చెడి మతముల మార్పిడిసులభము
జన్మమిచ్చు మాతృదేశ జాతియెపుడు మార్చరాదు.

ఏమట్టింబుట్టితివోయ్ ఏభూమి వసించెదవోయ్
ఏభూమి యొసంగుకూడు నీవుకుడిచి బ్రతికెదవోయ్
కనిపెంచిన హింద్‌మాత తనయుడనన నవమానమె
మాజాతియె వేరందువు మాతృద్రోహముగాదా !

అమెరికాలోబుట్టువాడు అమెరికనునె నేననునోయ్
రష్యాలోబుట్టువాడు రష్యనునే నేననునోయ్
చైనాలోబుట్టువాడు చైనీయుడ నేననునోయ్
హింద్ భూమిలోబుట్టి హిందూస్థానీననవా.



భాషలలో భేదాలా వేషములో భేదాలా
దేశములో భేదాలా దేహములో భేదాలా
పరస్పరవిభేదాలా మరణాంతోన్మాదాలా
మతకలహ నినాదాలా మహామతుల వాదాలు.



ఆంగ్లేయులు పాలించిన యపుడిది హిందూస్థాన్
మహమ్మదీయపాలన నీమహి యది హిందూస్థానే
నాడు, నేడు, ముందు దీనినామము హిందూస్థానే
హిందుమాత సుతులెల్లరు హిందూస్థానీవారే.

దేశపు ఆబాలవృద్ధ స్త్రీపురుషులు మనజాతి
అందరికై యందరమును శ్రమపడుటలె మననీతి
మతముపేరు జెప్పుకొనుచు మడిగట్టుకొనగనేల
కులమువేరె యనుచు అడ్డుగోడల నిడుకొనగనేల.

జాతీయపు వంశీయపు సౌభ్రాత్రము విడిపోనిది
వచ్చిన విడిపోనిజన్మ సంబంధము లివిరెండే
మతమెదియేనేక దేశ మాతృజాతులయిన పరులే
సతులెవరె నేకగర్భ జాతులెపుడు సోదరులే
జయహిందని ఒక్కసారి చేయుడోయి నినాదము.



విప్రలబ్ధ

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 11 | గళమ్ములనుసవరించి | నుతుమ్మొదల[శుతినించి |
| 6 | 10 | బల్లియ | నొల్లియ |
| 8 | 5 | సంపెంగ | సంపెగ |
| 16 | 4 | పైరుసవరించె | పైటసవరించె |
| 16 | 9 | ఆరవోసిన | ఆరవేసిన |
| 17 | 3 | నిస్సమ | నిన్‌సమ |
| 17 | 6 | పల్లకిలై | పల్లకులై |
| 18 | 12 | కాలనర్ప | కాలసర్ప |
| 21 | 1 | బంగరుభిల్ల | బంగరుఖిల్ల |
| 21 | 2 | జెప్పవే | చెప్పవే |
| 24 | 15 | మనసంతకోసేసి | మనసంతయుకోసేసి |
| 47 | 6 | మదిమి | ముదిమి |
| 47 | 7 | జరయున్‌లేని | ముదిమియులేని |
| 65 | 2 | కామునితూపుల | కామునితూపులు |
| 69 | 6 | సరిచేసి | సరిబేసి |
| 73 | 2 | నీవంతకు | నీవంతుకు |
| 81 | 7 | పుట్టినంక | పుట్టినాంక |
| 93 | 3 | దరినిది | దరినిడి |
| 94 | 8 | పదన్మ్యు | పదనును |
| 95 | 6 | కొమ్మల | కొమల |
| 96 | 10 | అవులోగన | అవులోగొను |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 97 | 15 | పిణుందురుల | పిణుదురుల |
| 98 | 12 | ప్రజలకెరుక | ప్రజకెరుక |
| 98 | 14 | మూాపురమ్ములు | మూాపురమ్ముల |
| 98 | 16 | చూాచుకమ్ము | చూాచుకము |
| 100 | 15 | చిగుర | చిగురు |
| 101 | 8 | గ్రాయ | గాయు |
| 102 | 3 | దిని | దివి |
| 102 | 8 | వర్షము | వర్షమ్ము |
| 102 | 11 | లబ్ధ | లబ్ధి |
| 104 | 15 | యేహి | యెహి |
| 105 | 10 | అన్న మెఱుగని | అన్నె మెఱుగని |
| 106 | 4 | మటులాంటి | మిటులొాంటి |
| 107 | 2 | నాకు | నీకు |
| 119 | 7 | నగనములో | గగనములో |
| 119 | 12 | ఆసి | ఆస్తి |
| 123 | 3 | ఓయనదొాకసారి | ఓయనడొాకసారి |

# ఇతర రచనలు.

ముద్రితములు : మణిమాల, ఆహ్వానము, జయధ్వజము. పోతనచరిత్రము (మహాకావ్యము)

అముద్రితములు : వైశాలి, (నాటకము), రాజ్యశ్రీ, జానపద భారతము, సత్యమేవజయతి, మొదలగు నాటకములు.

బుద్ధచరిత్రము, రైతుబిడ్డ, ఎవరురాజు మున్నగు బుఱ్ఱకథలు.

సాహిత్య వ్యాసమంజరి (వ్యాససంపుటి). వేంకటేశ్వర స్తవరాజము, నృసింహ స్తవ రాజము, శ్రీరామ స్తవరాజము మున్నగు శతకములు.

దాగురింతలు, సూక్తిసుధ మున్నగు ఖండ కావ్యములు.

ప్రతులకు :—

వానమామలై వరదాచార్యులు,

చెన్నూరు (వయా) మంచిర్యాల్.

జిల్లా ఆదిలాబాదు. (ఆం. ప్ర.)